# PRAJNAM BRAHMA

# నిత్య స్మరణీయము

# AYAMATMA BRAHMA



# THATVAMASI

వ్యాఖ్యాత

శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

# AHAM BRAHMASMI




# నిత్య స్మరణీయము




వ్యాఖ్యాత

## శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు





శ్రీ శుకబ్రహ్మాశ్రమము
శ్రీకాళహస్తి 517 640

ప్రథమ ముద్రణ: 1997 వెయ్యి ప్రతులు

వెల : రూ. 20.00

ప్రతులకు –
మేనేజర్
శ్రీ శుకబ్రహ్మాశ్రమము
శ్రీ శుకబ్రహ్మాశ్రమము (పోస్ట్)
శ్రీ కాళహస్తి– 517640

టైప్ సెట్టింగ్:
గీతా కంప్యూటర్స్
మద్రాసు–57.

ముద్రణ :
నాగార్జున్ ప్రింటర్స్
డాక్టర్ రాధాకృష్ణన్ నగర్, కొరుక్కుపేట,
చెన్నై - 600 021.

# తొలిపలుకు

సామాన్యముగ ప్రతి జీవియు - పశువేకాదు, మానవుడు కూడ, తనను జడమైన దేహముగనే భావించుచున్నాడు. మానవుడు ప్రజ్ఞావంతుడైన బ్రహ్మమే (ఆత్మయే) గాని, రక్తమాంసములతో కూడిన ఒక తోలుబొమ్మ కాదు. ఈ సత్యమును ఉపనిషత్తులు, ఆచార్యులు స్పష్టముగ ఘోషించి యున్నారు. వారు ఏ వాక్యములను తెలిపిరో, ఎట్టి గంభీర వచనములను పలికిరో ఈ గ్రంథమున తెలిపి యున్నాము. ఈ పరమ సత్యములను నిరంతరము స్మరించుచుండవలెను. 'శివోఽహం' అని ఎలుగెత్తి పాడు చుండవలెను. మనస్సును బహిర్ముఖముగ పోనివ్వక అంతర్ముఖ మొనర్ప వలెను. అపుడే జీవునకు పూర్ణసుఖము, పూర్ణశాంతి లభించును. నిత్యము స్మరించ వలసిన మహర్షుల వాక్యములు, ఉపనిషత్ వచనములు కనుక ఈ గ్రంథమునకు ''నిత్యస్మరణీయము'' అని పేరు పెట్టబడినది. విజ్ఞులు దీనిని పఠించి మహర్షులు తెలిపిన పరమ సత్యము లను ఆచరణయందుంచి ధన్యులగుదురు గాక! ఆత్మానందమును అనుభవించుదురు గాక!

ఈ జగత్తులో దృక్, దృశ్యము - అని రెండువస్తువులు గలవు. వీటినే క్షేత్రజ్ఞుడు, క్షేత్రము అని భగవద్గీతలో తెలిపి యున్నారు. జీవుడు క్షేత్రజ్ఞుడగు ఆత్మయేగాని దృశ్యమగు దేహముకాదు. దృశ్య స్వరూపమగు ఈ జగత్తును ఆత్మ యందు లయింప జేసి - ఇది కాదు, ఇది కాదు (నేతి, నేతి) - అని దృశ్యమును దూరముగ నుంచి ఆత్మగనే శేషింప వలెను. ఇదియే మనము చేయవలసిన జపము, ధ్యానము, లయము. ఈ విషయమునే శ్రీ శంకరాచార్యులవారు ''అహర్నిశం యత్పరిచిన్తనీయమ్? - సంసార మిథ్యాత్వ శివాత్మతత్త్వమ్'' - అని ప్రశ్నోత్తరమణిరత్నమాలలో పేర్కొని యున్నారు. 'ఇట్లు దృశ్యమును ఆత్మయందు లయింప జేసి పరమశాంతిని, పరమానందమును అనుభవింతురు గాక!

ఇట్లు

**శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు**

(గీతా జయంతి - 20-12-96)

# నిత్యస్మరణీయము

1. న మే దేహేన సంబంధో మేఘేనేవ విహాయసః
అతః కుతో మే తద్ధర్మా జాగ్రత్స్వప్నసుషుప్తయః.

తా. మేఘముల యొక్క రాకపోకలచే ఆకాశమునకు సంబంధము గాని, లాభనష్టములుగాని లేనట్లు ప్రత్యగాత్మనగు నాకు జాగ్రత్స్వప్న సుషుప్తులతో గాని, తద్ధర్మములతోగాని సంబంధము లేదు.

వ్యాఖ్యానము – ఆకాశమునకు మేఘముతో ఏ సంబంధమున్ను లేదు. మేఘములు వచ్చుచుండును, పోవు చుండును, ఉరుము చుండును, జలము వర్షించు చుండును, వడగళ్ళు కురిపించు చుండును, మెరయు చుండును. మేఘములు వాటివాటి కార్యములు చేయు చున్నను ఆకాశమునకు వాటితో ఏ సంబంధమున్ను లేదు.

ఆ ప్రకారమే ఆత్మకు శరీరముతో ఏ సంబంధమున్ను లేదు. ఆత్మ నిస్సంగము, నిర్వికారము. దేహసంబంధమైన జాగ్రత్స్వప్న సుషుప్త్యాదులు దానికి లేవు.

ఈ ప్రకారముగ భావించుచున్నచో జీవునకెంతయో ధైర్యము చేకూరును.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం, చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

2. సన్తువికారాః ప్రకృతేః దశధా శతధా సహస్రధా వాఽపి
తైః కింమేఽసంగచితే ర్నహ్యాంబుదడంబరోంబరం స్పృశతి.

తా. ప్రకృతి యొక్క వికారములు పదులు, వందలు, వేలు కలిగినను కలుగు గాక! మేఘ సమూహములు ఎన్ని వచ్చుచున్నను, పోవుచున్నను నిర్మలాకాశమున కెట్టి వికారము కలుగనట్లు అసంగ చిదాత్మనగు నాకు ప్రకృతి సంబంధ వికారము లేవియు అంటవు.

వ్యాఖ్యానము - ప్రకృతి, పురుషుడు - అని ఇరువురు గలరు. పురుషుడు నిర్వికారుడు. ప్రకృతి చంచలమైనది. ఈ ప్రపంచమున ఆత్మయగు పురుషుడు నిశ్చలుడు, నిర్వికారుడు. ప్రకృతి యొక్క వికారమగు జగత్తు చంచలము. జాయతే వర్ధతే - అనునట్లు పుట్టుచు, పెరుగుచు, నశించుచున్నది. పురుషుడగు ఆత్మ ఏ వికారములు లేక నిశ్చలుడై యున్నాడు. ప్రకృతి యొక్క వికారమగు జగత్తునకు ఎన్నియో వికారములు వచ్చు గాక! ఆత్మ నిర్వికారమై యుండును. లాభనష్టములు వచ్చుగాక! కష్టసుఖములు వచ్చుగాక! దేహమునకు చావు పుట్టుకలు వచ్చుగాక! మేఘములు వికారవంతములై యున్నను ఆకాశము నిశ్చలమై యుండును. ఇట్టి భావములచే మనుజుడెంతయో ధైర్యమును పొందును.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

3. జాగ్రత్స్వప్నసుషుప్త్యాది
ప్రపంచం యత్ప్రకాశతే
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా
సర్వబంధైః ప్రముచ్యతే.

తా. జాగ్రత్స్వప్నసుషుప్త్యాదు లన్నిటిని ఏ ఆత్మ ప్రకాశింప జేయుచున్నదో ఆ ఆత్మ, ఆ బ్రహ్మము నేనే అయియున్నాను. ఇట్లు తెలుసు కొనినచో సంసార బంధములన్నియు విచ్ఛిన్నములై పోవును.

వ్యాఖ్యానము – సూర్యుడు తాను ప్రకాశించుచు జగత్తంతటిని ప్రకాశింప జేయు చున్నాడు. ఒక వస్తువు ఇంకొక వస్తువును ప్రకాశింప జేసినపుడే అది ప్రకాశించును. జాగ్రత్తులోను, స్వప్నములోను, సుషుప్తిలోను ఎన్నియో కార్యములు జరుగు చున్నవి. వాటినన్నిటిని ఆత్మ ప్రకాశింప జేసినపుడే అవి ప్రకాశించును. జగత్తునకు ప్రకాశించు శక్తి స్వతహాగ లేదు. దేహము, జగత్తు మున్నగు వాటిని ఆత్మ ప్రకాశింప జేయునపుడే అవి ప్రకాశించును. అట్టి ఆత్మస్వరూపము నేనే యని తలంచునపుడు జీవున కెంతయో ధైర్యము చేకూరును.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

4. నాహం దేహో జన్మమృత్యూ కుతో మే
నాహం ప్రాణః క్షుత్పిపాసే కుతో మే
నాహం చిత్తః శోకమోహౌ కుతో మే
నాహం కర్తా బంధమోక్షౌ కుతో మే.

తా. నేను దేహమును కాను, అట్టిచో పుట్టుకచావులు నాకెట్లుండును?
నేను ప్రాణమును కాను అట్టిచో ఆకలిదప్పులు నాకెట్లుండును?
నేను చిత్తమును కాను అట్టిచో శోకమోహములు నాకెట్లుండును?
నేను కర్తను గాను, అట్టిచో బంధమోక్షము లెట్లుండును?

వ్యాఖ్యానము – తాను దేహమని అనుకొనినపుడే దేహమునకు సంబంధించిన చావుపుట్టుకలు తనకు గలవని తోచును.

తాను ప్రాణమని భావించినపుడే ప్రాణధర్మములగు ఆకలిదప్పులు తనకు గలవని తోచును.

తాను చిత్తమని తలంచినపుడే తద్వికారములకు శోకమోహములు తనకు గలవని తోచును.

తాను కర్తయని తలచినపుడే బంధమోక్షములు తనకు గలవని తోచును.

తాను దేహాదులు కానని భావించినపుడు జననమరణాదులు తనకు లేవని తోచును.

అపుడెంతయో ధైర్యము చేకూరును.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

5. స్వాంతఃకరణదోషేణ కల్పితేఽస్మిన్ జగద్భ్రమే
కః ప్రాజ్ఞః కలహం కుర్యాత్ స్ఫాటికే మంటపే శ్వవత్.

తా. తన యొక్క అంతఃకరణదోషము వలన కల్పింపబడిన ఈ జగత్తను భ్రమయందు ఏ ప్రాజ్ఞుడు మరొకనితో - స్ఫటికమండపమునందు కుక్క ప్రతిబింబమందలి మరొక కుక్కతో వలె - కలహము చేయును ?

వ్యాఖ్యానము – ఈ జగత్తంతయు మనస్సు యొక్క కల్పనయే, అంతఃకరణము చేత కల్పింపబడిన ఒక చిత్రము వంటిదే. స్ఫటిక మంటపము ఎదుట ఒక వ్యక్తి నిలబడినచో అనేక మంది వ్యక్తులు ఆ మంటపమునందు కనుపించుదురు. మనుజుడు అచట నిలబడి బొట్టు పెట్టుకొనును. కుక్క నిలబడినచో పెక్కు కుక్కలు అచట గలవని భావించి ఆ కుక్కలతో కలహించును. తెలివి గల మనుజునకు, తెలివితక్కువ కుక్కకు ఇదియే భేదము.

కాబట్టి ఈ జగత్తు కల్పితమైనదని తెలుసుకొని అందరు తన యొక్క స్వరూపులే యని భావించి అందరియెడల ప్రేమ, దయ, కరుణ చూపవలెను. ఎవరితోను కలహింపరాదు. జగత్తంతయు తనయందు కల్పింపబడినదే యగును.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

6. ఆకాశవత్కల్పవిదూరగోఽహం
ఆదిత్యవద్భాస్య విలక్షణోఽహమ్
అహార్యవన్నిత్య వినిశ్చలోఽహం
అంభోధివత్పారవివర్జితోఽహమ్.

తా. ఆకాశమువలె నేను అసంగుడను; సూర్యుడు స్వయంప్రకాశు డగుటయే కాక తనచే ప్రకాశింపబడు వస్తువులకంటె విలక్షణుడై నట్లు నేనున్ను స్వయం ప్రకాశకుడనై నాచే ప్రకాశింపబడు జగత్తుకంటె విలక్షణుడను; నేను పర్వతము వలె నిశ్చలుడను; సముద్రము వలె పారము (అంతము) లేనివాడను.

వ్యాఖ్యానము - నేను ఆత్మ స్వరూపుడనే కనుక ఆకాశమువలె అసంగుడను, సర్వవ్యాపకుడను. నేను సూర్యుని వలె మరొక వస్తువు చేత ప్రకాశింపబడనివాడను. పర్వతము వలె నేను నిశ్చలుడను. సముద్రము వలె నేను అపారమైన వాడను. ఈ ప్రకారముగ మనుజుడు తాను ఆత్మయని, సర్వవ్యాపకుడని, నిశ్చలుడని, అపారమైన వాడని నిరంతరము స్మరించుచుండవలెను. తాను జడమైన దేహమని ఏనాడును తలంపరాదు. చైతన్యమగు ఆత్మయేయని తలంపవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

7. తస్మాదహంకారమిమం స్వశత్రుం
భోక్తుర్గళే కంటక వత్ప్రతీతమ్
విచ్ఛిద్య విజ్ఞాన మహాసినా స్ఫుటం
భుంక్ష్వాత్మ సామ్రాజ్యసుఖం యథేష్టమ్.

తా. భోజనము చేయుచున్న వాని కంఠములో చిక్కుకున్న ముల్లు వలె దుఃఖ ప్రదమును, స్వశత్రువును అగు అహంకారమును విజ్ఞానమనెడి మహా ఖడ్గముతో ఛేదించి ఆత్మ సామ్రాజ్యమును యథేష్టముగ అనుభవింపుము.

వ్యాఖ్యానము – భుజించుచున్నవానికి గొంతులో గ్రుచ్చుకొన్న ముల్లు ఎంతగా బాధించు చుండునో ఆత్మానుసంధానము చేయుచుండు వానికి అహంకారము అంతగా ప్రతిబంధకము కలిగించు చుండును. కాబట్టి ఆత్మ జ్ఞానమను కత్తిచే ఆ ముల్లును విచ్ఛిన్న మొనర్చవలెను. అట్లు చేసి మనుజుడు ఆత్మానందమును ఇష్టము వచ్చినట్లు గ్రోలవలెను. ఆత్మానందమును అనుభవించునపుడు ఈ అహంకారము ఒక పెద్ద అడ్డుగ యుండును. భుజించు వానికి కంఠములో ముల్లు వలె అది ఆటంకముగ యుండును. ఆత్మజ్ఞానమను ఖడ్గముచే దానిని తొలగించి వేసి బ్రహ్మానందమును నిరాటంకముగ పానము చేయవలెను. ఇదియే జీవుని కర్తవ్యము.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

8. పరమే బ్రహ్మణి స్వస్మిన్
ప్రవిలాప్యాఖిలం జగత్
గాయన్నద్వైతమానంద
మాస్తే వేదాంతడిండిమః.

తా. తన ఆత్మ (బ్రహ్మ) స్వరూపము నందు ఈ జగత్తంతటిని లయమొనర్చి అద్వైతానందమును గ్రోలుచు అట్టి అద్వైతస్థితిని గూర్చి గానము చేయుచు బ్రహ్మనిష్ఠుడు యుండవలెను.

వ్యాఖ్యానము – ఈ జగత్తంతయును బ్రహ్మమునందు కల్పింప బడినదే యగును. విజ్ఞుడు అద్దానిని తన ఆత్మయందు, బ్రహ్మమునందు విలీన మొనర్చి అట్టి అద్వైత స్థితి యందు ఆత్మానందమును, బ్రహ్మానందమును పాన మొనర్చుచు అద్వైతస్థితిని గూర్చి గాన మొనర్చుచు కాలమును గడుపవలెను. కాలమును వ్యర్థ మొనర్ప రాదు. శివోఽహం శివోఽహం అని తన నిజ స్వరూపమగు ఆత్మను గూర్చి చింతించుచుండవలెను.

నేను ఆత్మనే గాని జడమగు శరీరము కాదని పదేపదే సంస్మరించు చుండవలెను. తాను బ్రహ్మమని, కల్పితమగు జగద్రూపము కాదని నిరంతరము చింతన చేయు చుండవలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

9. అత్యన్తాభావఏవాతో
జగద్దృశ్యస్య సర్వధా
వర్జయిత్వేతరా యుక్తి
ర్నాస్త్యేవానర్థ సంక్షయే.

తా. సంసారరూప అనర్థము క్షయించుటకై - దృశ్యరూప జగత్తు ఏమియు లేదు - అను యుక్తి ఒకటి తప్ప మరొకటి ఏదియును లేదు.

వ్యాఖ్యానము - దృశ్యరూప జగత్తు కేవలము మిథ్య, అది ఏ కాలమందును లేదు అని భావించుట తప్ప దుఃఖవిముక్తికి వేరొక ఉపాయమేదియును లేదు. ఈ దృశ్యరూప జగత్తు కేవలము ఉపాధివలననే కలిగినది. కాబట్టి అది కల్పితమైనదే యగును. ఆత్మ ఒకటియే సత్యము. త్రికాలములందు యున్నది ఆత్మ ఒకటియే. కాబట్టి ఈ భావమును మరల మరల చింతన చేయుచు తాను సచ్చిదానందరూపమగు ఆత్మయే అనియు, దృశ్యము లేనిదనియు నిరంతరము చింతన చేయుచుండవలెను. బంధ విముక్తికి, దుఃఖరాహిత్యమునకు ఇదొక్కటియే మార్గము.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

10. దృశ్యం పశ్యన్స్వమాత్మానం
న ద్రష్టా సంప్రపశ్యతి
ప్రపంచాక్రాంత సంవిత్తేః
కస్యోదేతి నిజాస్థితిః.

తా. దృశ్యమును చూచుచు ఆత్మను ఎవరును చూడలేరు. ప్రపంచ దృష్టి గలవారికి, బాహ్యదృష్టి గలవారికి ఆత్మానుభూతి కలుగ నేరదు.

వ్యాఖ్యానము – ప్రపంచమువైపు దృష్టి మరలిన వారికి ఆత్మయందు నిలకడ కలుగనేరదు. ఆత్మానుభూతి కలుగుటకు దృష్టి బాహ్యము నుండి మరలి అంతర్ముఖము కావలెను. కనుకనే పెద్దలు ధ్యానమును అభ్యసించవలెనని చెప్పిరి. ధ్యానకాలములో ఇంద్రియములను, మనస్సును అంతర్ముఖము చేసి ఆత్మయందు స్థాపించుదురు. కాబట్టి దృష్టిని ప్రపంచము వైపు నుండి మరల్చి ఆత్మ యందు స్థాపించవలెను. తరింప దలంచువారు, పరమానంద మనుభవింప దలచిన వారు ఇట్టి అంతర్ముఖత్వమును చక్కగ అభ్యసించవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

11. యావత్సర్వం న సంత్యక్తం
తావదాత్మా న లభ్యతే
సర్వావస్థా పరిత్యాగే
శేష ఆత్మేతి కథ్యతే.

తా. అంతయు వదలనిదే ఆత్మ లభింపదు. సర్వత్యాగము వలననే ఆత్మ యందు స్థితి సంభవించును.

వ్యాఖ్యానము – దృశ్యమంతయును త్యజించినచో ఆత్మ మిగులును. సర్వత్యాగము వలననే ఆత్మానుభూతి సిద్ధించును. ఇంద్రియములు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము – ఇవన్నియును దృశ్యకోటికి సంబంధించినవి. ఆత్మానుభూతిని పొందగోరువారు వీటిపై దృష్టిని యుంచరాదు. వీటిని త్యజించినచో మాత్రమే ఆత్మయందు స్థితి సంభవించును; ఆత్మానుభూతి, పరమానందము సిద్ధించును. అన్నిటిని త్యజించినచో ఏది మిగులునో అదే ఆత్మ. కాబట్టి పరమానందమును పొందుటకు సర్వత్యాగమును లెస్సగ అభ్యసించవలెను.

అహం బ్రహ్మాస్మి –

ఓం ఓం సోஉహం, సోஉహం, శివోஉహం, శివోஉహం –
చిదానందరూప శ్శివోஉహం శివోஉహం.

12. నాహం బ్రహ్మేతి సంకల్పాత్
సుదృఢాద్బధ్యతే మనః
సర్వం బ్రహ్మేతి సంకల్పాత్
సుదృఢాన్ముచ్యతే మనః.

తా. 'నేను బ్రహ్మమును కాను' - అను సంకల్పముచే మనస్సు బంధమును, 'సర్వము బ్రహ్మము' అను సంకల్పముచే మనస్సు విముక్తిని బడయు చున్నది.

వ్యాఖ్యానము - బంధమునకు మోక్షమునకు ఉపాయము ఈ శ్లోకమున తెలుపబడుచున్నది. నేను బ్రహ్మమును కాను, జడమైన దేహమును - అని భావించుట చేత జీవుడు బంధింప బడుచున్నాడు. జననమరణ ప్రవాహములో పడి పుట్టుచు చచ్చుచు యున్నాడు. అట్లు కాక ఈ సమస్తము బ్రహ్మమే అని తలంచుట చేత జీవుడు ముక్తుడై జననమరణములను తప్పించు కొనుచున్నాడు. కనుక నిరంతరము - నేను బ్రహ్మమును, నేను ఆత్మ స్వరూపుడను - అని తలంచు చుండవలెను. కావుననే పెద్దలు అజపా గాయత్రియగు సోஉహం, మంత్రమును జపించులాగున చెప్పి యున్నారు.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోஉహం, సోஉహం, శివోஉహం, శివోஉహం - చిదానందరూప శ్శివోஉహం శివోஉహం.

13. యావదన్యన్న సంత్యక్తం
తావత్సామాన్యమేవహి
వస్తునాసాద్యతే సాధో స్వాత్మ
లాభేతు కా కథా.

తా. సామాన్యముగ ఏదైన ఒక వస్తువును ఇవ్వనిచో తిరిగి మరొక వస్తువును ఇవ్వరు. అట్టిచో ఇక ఆత్మను గూర్చి వేరుగ చెప్పవలెనా! ఆత్మ కావలెననిచో దృశ్యత్యాగము, సంకల్పత్యాగము అత్యావసరము.

వ్యాఖ్యానము – బజారునకు వెళ్ళి ఒక వస్తువును కొనదలచినచో కొంత డబ్బును వెంట తీసుకొని వెళ్ళుదురు. ఇది సామాన్య వ్యవహారము. డబ్బు నొసంగిననే వస్తువును ఇచ్చుదురు. అట్టిచో ఇక ఆత్మను కోరుకొనిన వారికి ఎంత త్యాగము అవసరమో వేరుగ చెప్పవలెనా? ఆత్మను పొందగోరువారు సంకల్పమును పూర్తిగ త్యాగము చేయవలెను. దృశ్యమును పూర్తిగ త్యాగము చేయవలెను. ఇదొక్కటియే మార్గము. కనుకనే శాస్త్రములలో ఆత్మానుభూతికి సర్వత్యాగమవసరమని పేర్కొనిరి. ఏమియు త్యాగము చేయనిచో సామాన్య ప్రాపంచిక వస్తువు కూడ లభించదు. కావున ఆత్మను కోరువారు సర్వ సంకల్పత్యాగమునకు సిద్ధపడవలెను. బ్రహ్మా నందమును కోరువారు అల్పానందములను వదలి వేయవలెను.

ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం..

14. ప్రబుధ్యస్వ ప్రబుధ్యస్వ
పునః పునరయంమయా
ప్రబోధ్యసే మహాబాహో
పశ్యాత్మార్కమనామయమ్.

తా. శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీ రామచంద్రునకు ఈ ప్రకారముగ బోధించిరి. ఓ రామచంద్రా! నీవు ప్రబుద్ధుడవు కమ్మని పదేపదే చెప్పుచున్నాను. నీవు ప్రబుద్ధుడవై నిర్వికారమగు ఆత్మ యను సూర్యుని సందర్శింపుము.

వ్యాఖ్యానము – శ్రీ వసిష్ఠుడు యోగవాసిష్ఠము నందు శ్రీ రామచంద్రుని ప్రబుద్ధునిగ చేయుచు ఇట్లు బోధించిరి – ఓ రామచంద్రా! నీవు ప్రబుద్ధుడవుకా! అని మరల మరల నీకు చెప్పుచున్నాను. కావున ప్రబుద్ధుడవుకమ్ము! ఆత్మయను సూర్యుని సందర్శింపుము. తరింపుము.

ఈ సంసార రూప అంధకారమందు నివసింపరాదు. మానవుడు జన్మించినది బంధమున తగులుకొనుటకు కాదు. అజ్ఞానమను సంకెళ్ళను విచ్ఛిన్న మొనర్చి జ్ఞానమును బడయుటకే. మరల మరల జన్మలను పొందుటకు కాదు, జన్మ రాహిత్యమునకే. ప్రతి ప్రాణి యొక్క కర్తవ్యమిదియే. స్వస్వరూపమగు ఆత్మను సాక్షాత్కరించుకొని అజ్ఞానరూప బంధమును పటాపంచలు చేయుటకే.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

15. న తే జన్మ న తే దుఃఖం న దోషాస్తే న తే భ్రమాః
సర్వం సంకల్పముత్సృజ్య తిష్ఠాత్మని సుసంస్థితః.

తా. శ్రీ వసిష్ఠుడు శ్రీ రామచంద్రునకిట్లు బోధించిరి - ఓ రామచంద్రా! నీవు ప్రబుద్ధుడవైతివి కావున ఇక నీకు జన్మ లేదు, దుఃఖము లేదు, దోషములు లేవు. భ్రమలు లేవు. నీవు సమస్త సంకల్పములను విడిచి పెట్టి ఆత్మయందు స్థిరముగ నెలకొని యుండుము.

వ్యాఖ్యానము - ఆత్మయందు స్థిరముగ నెలకొని యుండువానికి ఇక సాంసారిక స్థితులు ఎటుల యుండును? కనుకనే ఈ చావు పుట్టుకలు గాని, సుఖదుఃఖములుగాని, రాగద్వేషములుగాని, సాంసారిక భ్రమలుగాని అతని కేమాత్రము యుండవు. ఓ రామచంద్రా! నీవు బంధ విముక్తుడవైతివి, తరించితివి. అజ్ఞాన శృంఖలములను విచ్ఛిన్న మొనర్చి వేసితివి. అజ్ఞానులకు వలె నీకిక భ్రమలేవియు యుండవు. ఓ రామచంద్రా! నీవిపుడు ఆత్మయందు సుస్థిరముగ నెలకొని యుండుము.

అజ్ఞానులకు కలుగు దుఃఖాదు లేవియు నీకిపుడు కలుగవు. అట్టి ఆత్మానంద స్థితియందు స్థిరముగ యున్నవాడవై, స్థితప్రజ్ఞుడవై జీవితమును పరమానందముగ గడిపి వేయుము.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

16. బహుశాస్త్రకథాకంథా రోమంథేన వృథైవ కిమ్
అన్వేష్టవ్యం ప్రయత్నేన మారుతే! జ్యోతిరాన్తరమ్.

తా. ఆచరణ లేక అనేక శాస్త్రములను ఊరక చదువుట వలన ఏమి ప్రయోజనము? ఓ ఆంజనేయా! హృదయకమలమధ్యమున యున్న ఆత్మను గూర్చి ప్రయత్న పూర్వకముగా అన్వేషించి దానిని సాక్షాత్కరించుకొని ఆనందానుభూతిని బడయవలెను.

వ్యాఖ్యానము – శ్రీ రామచంద్రుడు చివరిదగు ముక్తికోపనిషత్తు నందు అంజనేయునకిట్లు బోధించిరి – జనులలో చాలమంది శాస్త్రములను చదువుచున్నారే కాని వాటి భావములను ఆచరణయందుంచుట లేదు. సమస్త శాస్త్రముల యొక్క లక్ష్యము ఆత్మసాక్షాత్కారవము. అది లేకుండ ఎన్ని శాస్త్రవములను చదివినప్పటికిని, కంఠస్థము చేసినప్పటికి ఏమి లాభము? కనుక శాస్త్రములను చదువువారు వాటిని నిత్య జీవితములో ఆచరణ యందుంచ వలెను. అపుడు మాత్రమే హృదయస్థమగు ఆత్మ అనుభూతమగును, పరమానందముద్భవించును.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

**17. విచారితమలం శాస్త్రం చిర ముద్గాహితం మిథః**
**సంత్యక్త వాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదమ్.**

తా. మేము ఎన్నియో శాస్త్రములను విచారించితిమి. వాటి భావములను పరస్పరము చర్చించు కొంటిమి. కాని వాసనలను త్యజించి మౌనముగ ఆత్మలో స్థితి కలిగి యుండుట కంటె గొప్పపదవి వేరొకటి కానరాలేదు. (శ్రీ వసిష్ఠమహర్షి శ్రీ రామచంద్రునకు బోధించిన విషయములు).

వ్యాఖ్యానము - ప్రపంచములో ఎన్నియో పదవులు గలవు. రాజ్యపదవి, చక్రవర్తి పదవి, ఇంద్రపదవి మున్నగు పదవులు ఎన్నియోగలవు, కాని అన్నిటి కంటె గొప్ప పదవి వాసనాత్యాగ మొనర్చి ఆత్మ యందు స్థితి కలిగి యుండుటయే. కాబట్టి అట్టి పదవి కొరకై జీవుడు అన్వేషింప వలెను. సమయమును వృథా చేయక వాసనలను త్యజించుట కొరకును, ఆత్మయందు స్థితినొంది యుండుట కొరకును జీవుడు అహర్నిశములు ప్రయత్నించ వలెను. అన్నిటికంటె గొప్పపదవిని పొందుటకై అహర్నిశములు కృషి చేయవలెను. మానవ జీవితము చాల అమూల్యమైనది. దానికి ఇతర ప్రాపంచిక కార్యములకై వినియోగంపక వాసనాక్షయమునకు, ఆత్మయందు స్థితికొరకు వినియోగింపవలెను.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

18. అనర్థేనావిచారేణ వయః కుర్యాన్న భస్మసాత్
బోధేన జ్ఞానసారేణ దృశ్యం కర్తవ్యమాత్మసాత్.

తా. ఓ జనులారా! అనర్థములగు ప్రాపంచిక విచారణల చేత జీవితమును బూడిదపాలు చేయకుడు. జ్ఞానసారమగు ఆత్మబోధ చేత దృశ్యమును ఆత్మయందు విలీన మొనర్పుడు. (శ్రీ వసిష్ఠమహర్షి బోధ)

వ్యాఖ్యానము - జనులు అజ్ఞానవశమున తమ అమూల్యమైన మానవ జీవితమును వ్యర్థముగ గడిపి వేయుచున్నారు. అట్లు గడుపకుడు - అని శ్రీ వసిష్ఠుడు శ్రీ రామచంద్రుని నిమిత్తముగ జేసుకొని ప్రజలకు ఉద్బోధించు చున్నారు. ఓ జనులారా! వ్యర్థప్రాపంచిక విచారణలయందు సమయమును పోగొట్టుకొనవద్దు. అమూల్యమైన ఆత్మవిచారణను ఆశ్రయించి కల్పితమైన ఈ దృశ్యమును ఆత్మయందు విలీనము చేసివేయుడు. ఇదియే జీవుని కర్తవ్యము. మానవజన్మ మాటిమాటికి వచ్చునది కాదు. కాబట్టి అట్టి మహోన్నత జీవితమును వాసనాత్యాగమునకు, ఆత్మ సాక్షాత్కారము నకు వినియోగించి జీవుడు ధన్యుడు కావలెను. వ్యర్థప్రాపంచిక విచారణల యందు అట్టి అమూల్యజీవితమును పాడుచేయరాదు.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

19. న మృత్యుర్న శంకా న మే జాతి భేదః
పితా నైవ మే నైవ మాతా న జన్మ
న బంధు ర్నమిత్రం గురుర్నైవ శిష్యః
చిదానందరూప శ్శివోఽహం శివోఽహమ్.

తా. నాకు మృత్యువులేదు, నాకు సంశయము లేదు, జాతిమత కులభేదము లేదు, నాకు తండ్రి, తల్లి, జన్మ, బంధువు, మిత్రుడు గురువు, శిష్యుడు ఎవరును లేరు. నేను చిదానందరూపుడను, శివస్వరూపుడను, ఆత్మ స్వరూపుడను.

వ్యాఖ్యానము - మానవుని యొక్క నిజస్వరూపమును శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు ఈ శ్లోకమందు విశదీకరించు చున్నారు. మానవుడు జడమైనట్టి ఒక మట్టి ముద్ద కాదు, రక్తమాంసములతో కూడిన ఒక బొమ్మకాదు. చిదానందరూపుడగు శివస్వరూపుడే జీవుడు. అతనికి మృత్యువు లేదు. అతనికి జాతిమతకుల గోత్రములు లేవు. బ్రహ్మానందమే జీవుడు. కాబట్టి ఇట్టి మహోన్నత స్వస్వరూపమును జీవుడు మరల మరల మననము చేయవలెను. అట్లు చేసి జీవితము పూర్తి కాకమునుపే ఆత్మసాక్షాత్కారమును బడయవలెను.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

20. అవిచ్ఛిన్న చిదాత్మైకః
పుమానస్తీహ నేతరత్
స్వసంకల్పవశాద్బద్ధో
నిస్సంకల్పశ్చ ముచ్యతే.

తా. జీవుడు అవిచ్ఛిన్నమగు చిదాత్మయే కాని మరొకడు కాదు. తన సంకల్పము చేతనే బద్ధుడగు చున్నాడు. సంకల్పరాహిత్యముచే ముక్తుడగు చున్నాడు.

వ్యాఖ్యానము - శ్రీ యోగవాసిష్ఠము నందు శ్రీ వసిష్ఠమహర్షి తెలిపిన వాక్యములివి. జీవుడు జడమైన ఒక వస్తువు కాదు, కాలగర్భములో లీనమగు ఒక పదార్థము కాదు. జీవుడు శాశ్వతుడు. అవిచ్ఛిన్నచిదాత్మ స్వరూపుడు. అతనికి చావు పుట్టుకలు లేవు. అతడు చిదానంద శివస్వరూపుడు. సచ్చిదానంద ఆత్మస్వరూపుడు. అతడు దేశకాలములచే విచ్ఛిన్నుడు కాజాలడు. ఇట్టి భావములను జీవుడు ప్రతిదినము అహర్నిశములు చింతన చేయు చుండవలెను. మననినిదిధ్యాసములు గావించుచుండవలెను. మానవ జీవితము యొక్క ప్రతిక్షణము బహు అమూల్యమైనది. కాబట్టి దానిని వృథా చేయక శివోఽహం, శివోఽహం అని తలుచుచు ప్రతి క్షణమును వినియోగించుచుండవలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

21. ఆనందమంత ర్నిజమాశ్రయంతః
ఆశాపిశాచీ మవమానయన్తః
ఆలోకయన్తః జగదింద్రజాలం
ఆపత్కథం మాంప్రవిశేత్ అసంగమ్.

తా. హృదయాంతరాళమున ఆత్మానందమును ఆశ్రయించువాడును, ఆశాపిశాచమును తరిమి వేయువాడును, ఈ జగత్తును 'ఇంద్ర జాలము' వలె మిథ్యగ గాంచువాడును, అసంగుడును అగు నాకు ఇక ఆపత్తులెట్లు కలుగును ?!

వ్యాఖ్యానము - బ్రహ్మనిష్ఠుని యొక్క అనుభూతి ఇచట వర్ణింప బడినది. ఇది ఉపనిషద్వాక్యము. బ్రహ్మవిద్వరిష్ఠుడు ఎల్లపుడు ఆత్మానందమనుభవించు చుండును. అతనికి విషయములపై ఆశ యుండనే యుండదు. బ్రహ్మ మొకటియే సత్యమనియు, జగత్తు ఇంద్రజాలము వలె మిథ్య అనియు అతడెరింగి యుండును. జగత్తుతో ఏ మాత్రము సంబంధము లేక అసంగుడై యుండును. అట్టివానికి ఆపత్తులు ఎట్లు కలుగును ?! స్వప్నములో కలిగిన క్రియలచే మేలుకొనిన వానికేమైన ఆపత్తు కలుగునా ?! కాబట్టి అట్టి బ్రహ్మనిష్ఠుడు నిర్భయుడై ఆనందసాగరమున ఓలలాడు చుండును. అతనికి దుఃఖమేమియు కలుగదు.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

22. ఏకో వశీ సర్వభూతాంతరాత్మా
ఏకం రూపం బహుధా యఃకరోతి
తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాః
తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్.

తా. ఏకమైనదియు, సమస్తమును తన వశమందుంచు కొన్నదియు, సమస్త ప్రాణికోట్ల యొక్క హృదయాంతరాళమున వెలుగునదియు, ఏకరూపమును అనేకములుగ ఒనర్చునదియు అగు ఆత్మను తమ స్వరూపముగ ఎవరు గాంచుచుందురో అట్టి ధీరులకే శాశ్వత సుఖము కలుగును గాని మరొకరికి కాదు.

వ్యాఖ్యానము - ప్రపంచములో ఎందరో విషయ సుఖముల ననుభవించుదురు. వారికి శాశ్వత సుఖము కలుగనేరదు. తాను ఆత్మరూపుడే అని భావించుచు ఆత్మానందమనుభవించువానికే పూర్ణ సుఖము కలుగునుగాని విషయసుఖాభిలాషికి కాదు. ఏ ఆత్మ సమస్త జగత్తు నంతట వెలుగుచున్నదో అదియే తమ హృదయమందు వెలుగుచుండునని ఆతడు తెలుసుకొని యుండును. సర్వుల యెడల దయ, కరుణ కలిగి వైరము లేక సమస్త ప్రాణికోట్ల యెడల ఆ బ్రహ్మనిష్ఠుడు ప్రేమ కలిగి యుండును. ఆతడనుభవించు ఆనందము మరెవరికిని కలుగదు. కాబట్టి అట్టి ఆత్మానందానుభూతికై, అట్టి పూర్ణ సుఖానుభూతికై జనులు అహర్నిశములు ప్రయత్నించి మానవ జీవితమును సఫల మొనర్చుకొనవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

23. ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష న చ కశ్చిత్ శృణోతి తత్
అసంకల్పః పరంశ్రేయః స కిమన్త ర్నభావ్యతే.

తా. యోగవాసిష్ఠము నందు శ్రీ వసిష్ఠమహర్షి ఆధ్యాత్మిక మహాసభలో రెండు చేతులను పైకెత్తి ప్రతిజ్ఞ చేయుచు పలికిన వాక్యములివి- నేను రెండు చేతులను పైకెత్తి - ఏ సంకల్పమునులేక ఆత్మ యందు స్థితి కలిగి యుండుటయే పరమ శ్రేయము, దానిని జనులు ఎందుకు పొందుట లేదు? అని తెలుపు చున్నాను. నా వాక్యము నెవరును వినుట లేదే!

వ్యాఖ్యానము - అసంకల్ప ఆత్మస్థితి ప్రపంచములోని అన్ని పదవుల కంటెను గొప్పపదవి. అయినను దానిని జనులు ఎందుకు అనుభవించుట లేదు?! అని శ్రీ వసిష్ఠ మహర్షి ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నారు. గొప్ప అనుభవశాలి అయిన బ్రహ్మనిష్ఠుడు రెండు చేతులను పైకెత్తి ప్రతిజ్ఞ చేసి చెప్పినందున ఆ వాక్యములు పరమ సత్యములై యుండును. కాబట్టి జనులు వారి బోధను ఆచరణ యందుంచి మహోన్నతమైన ఆత్మపదవిని పొందవలెను. మానవ జీవితము అల్పవిషయములను అనుభవించుటకు కాదు. నిత్య శుద్ధ బుద్ధ ముక్తమైనట్టి ఆత్మ స్థితియందు నిలకడ కలిగి బ్రహ్మా నందమనుభవించుట కొరకే మానవజన్మ ఏర్పడినది. పెద్దల వాక్యముల యెడల వినయ విధేయతలు, శ్రద్ధ కలిగి వారు బోధించినట్లు, సంకల్పరాహిత్య స్థితిని సంపాదించి జీవితమును సఫల మొనర్పవలెను.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

24. క్వగతం కేనవానీతం కుత్రలీనమిదం జగత్
అమునైన నిమేషేణ నాస్తి కిం మహదద్భుతమ్.

తా. ఆత్మానుభూతి కలిగిన బ్రహ్మనిష్ఠుడు పలికిన వాక్యములివి - తురీయ స్థితియందు మనుజునకు ఈ జగత్తంతము ఆత్మయందు విలీనమై యుండును. అపుడతడు ఆశ్చర్యచకితుడై, "ఈ జగత్తు ఎచటికేగినది? ఎవరు దీనిని తీసుకొనిపోయిరి? దేనియందు లయమైనది? ఆహా! ఈ క్షణమందే మాయమై పోయినదే! ఎంత ఆశ్చర్యము! - అని పలుకును.

వ్యాఖ్యానము - ఆత్మానుభవ సమయమున మిథ్యయగు ఈ జగత్తు యుండనే యుండదు. అది బ్రహ్మమందు విలయమై పోవును. సత్యమగు బ్రహ్మ మొకటియే, ఆత్మ ఒకటియే మిగిలి యుండును. బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా అను సూత్ర మొకటియే ఆచరణలో శేషించి యుండును. అందుచే అతడు ఆశ్చర్యముతో ఇట్లు పలుకుచున్నాడు. ఈ జగత్తు ఎచటికేగినది? ఎవరు దీనిని తీసుకొనిపోయిరి? దేని యందు లయమైనది! - అని బ్రహ్మనిష్ఠుడు పలుకుచున్నాడు. ఆత్మానుభవ సమయమున జగత్తు యొక్క లేశమైనను అనుభూతి యుండదు. అది తనలోనే లీనమై పోవును. ఆహా! అది ఎంతటి మహోన్నత అనుభవము!

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

25. శైలూషో వేషసద్భావాభావయోశ్చ యథాపుమాన్
తథైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠః సదాబ్రహ్మైవ నాపరః.

తా. నటుడు వేషమందున్నను, వేషము తీసినను పురుషుడే అయి యున్నట్లు - బ్రహ్మనిష్ఠుడు వ్యవహారమందున్నను, సమాధి నిష్ఠయందున్నను పరబ్రహ్మమే గాని ఇతరము కాదు.

వ్యాఖ్యానము - నాటకములో ఒక పురుషుడు అనేక వేషములు వేసినను వేషములో మార్పేకాని వ్యక్తిలో కాదు. అసలు వ్యక్తి యందు మార్పు యుండదు. ఒక పురుషుడు స్త్రీ వేషము వేసినను అతడు పురుషుడే కాని స్త్రీ కాదు. అట్లే బ్రహ్మనిష్ఠుడు క్రియలను చేయుచున్నను, ఊరక యున్నను బ్రహ్మమే కాని అన్యము కాదు. బ్రహ్మనిష్ఠుడు నడుచుచున్నను, కూర్చుని యున్నను, భుజించుచున్నను తాను బ్రహ్మమనియే తలంచు చుండును. అట్టి నిరంతర ఆత్మస్థితిని, బ్రాహ్మీస్థితిని ప్రయత్న పూర్వకముగ సంపాదింపవలెను. అహం బ్రహ్మాస్మి అను భావనను నిరంతరము కలుగజేసుకొనవలెను. ఈ జగత్తు ఒక నాటకము. ఈ నాటకమందు ప్రాణికోట్లన్నియు పాత్రధారులు. ఎన్ని వేషములు ధరించినను ఉపాధి వేరేకాని లోపల ఆత్మ వేరు కాదు.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

26. అపి తూష్ణీం స్థితేనైవ తత్పదం ప్రాప్యతే పరమ్
పరమం యత్ర సామ్రాజ్యమపి రామ తృణాయతే.

తా. వాసన లేవియు లేక ఆత్మస్థితుడై ఊరక యున్నచో సామ్రాజ్య పదవి కూడ తృణముగ తోచునట్టి మహోన్నత పదము లభించును.

వ్యాఖ్యానము - వాసన లేవియు లేక, ఊరక యున్నచో, ఆత్మయందు స్థితి కలిగి యున్నచో అది సామ్రాజ్యపదవి కంటెను గొప్ప పదవి. ఊరక యున్నచో అని చెప్పిన చోట సోమరిగ యున్నచో అని అర్థము చేసుకొనరాదు. నిస్సంకల్పస్థితియని అర్థము, ఆత్మస్థితియని భావము. సామ్రాజ్యపదవి చాల గొప్పదని పలువురు తలంచుదురు. దానికంటెను గొప్పది ఈ నిస్సంకల్ప ఆత్మస్థితి. ఒక చిన్న సామ్రాజ్యమునకు ఆధిపత్యము వహించుట కంటె ఆత్మపదవి మహోన్నతమైనది. ఆత్మయందు బ్రహ్మాండము లన్నియు కూడ ఇమిడియున్నవి. కాబట్టి సమస్త బ్రహ్మాండములను అట్టి ఆత్మస్థితిలో పొందినట్లగును. కావున అట్టి సర్వోత్కృష్ట ఆత్మపదవి కొరకై జనులు అహర్నిశములు ప్రయత్నించుదురు గాక! అమూల్యమైన మానవ జన్మను చరితార్థ మొనర్చుకొందురు గాక!

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

27. ఆపతన్తు వపుః పద్మే సుఖదుఃఖహిమశ్రియః
ఆకాశోడ్డయనాలీనాం కా నః క్షతిరుపస్థితా.

తా. శరీరమను పద్మముపై సుఖదుఃఖములను మంచు పడుగాక! ఆకాశమునకు ఎగిరిన తుమ్మెదలు అను మనకు ఏమి హాని కలుగును?

వ్యాఖ్యానము – శ్రీ వసిష్ఠ మహర్షి యోగవాశిష్ఠ మందలి ఉత్పత్తి ప్రకరణమున చక్కటి ఉపమాన మొకదానిని తెలిపెను. చెఱువులోని పద్మముపై మంచు పడినను ఆకాశమునకు ఎగిరిపోయిన తుమ్మెదకు దానివలన ఏమి హానియు కలుగదు. అట్లే సుఖ దుఃఖములు, లాభనష్టములు, మానావమానములు శరీరమను ఉపాధికి కలుగునే కాని అద్దానికంటె వేరుగ యున్న ఆత్మకు కాదు. క్షేత్రము వేరు, క్షేత్రజ్ఞుడు వేరు. ధ్యానాదుల ద్వారా ఇట్టి క్షేత్రజ్ఞ విభాగస్థితిని మానవుడు పొందవలెను. అపుడు జీవితము పరమానందముగ గడిచి పోవును. ''క్షేత్రజ్ఞం చాపి మాంవిద్ధి'' – అని భగవద్గీతలో చెప్పినట్లు క్షేత్రము కంటె వేరైన క్షేత్రజ్ఞ (ఆత్మ) స్థితిని పొందినపుడు మానవుడు సాక్షాత్ మాధవుడే యగును. జీవుడు శివుడే యగును. నరుడు నారాయణుడే యగును. కాబట్టి యత్న పూర్వకముగ అట్టి క్షేత్రజ్ఞ ఆత్మ స్థితిని మనుజుడు పొంది సుఖించును గాక!

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

28. రసం బ్రహ్మ పిబేద్యస్తు
తృప్తో యః పరమాత్మని
ఇంద్రం చ మన్యతే రంకం
నృపాణాం తత్ర కా కథా.

తా. పరమాత్మయందు స్థితి కలిగి బ్రహ్మానందమను అమృతరసమును త్రాగుచు తృప్తి నొందియుండువాడు ఇంద్రుని కూడ ఒక బీదవాని వలె తలంచును. ఇక సామాన్య రాజుల విషయమై వేరుగ చెప్పవలెనా?

వ్యాఖ్యానము – ఆత్మస్థితి ఎంతమహోన్నతమైనదో ఈ శ్లోకము నిరూపించుచున్నది. ఆత్మయందు నిలకడ కలిగియుండువానికి ఇంద్రపదవియు గొప్పదిగ తోచదు. ఇక సామాన్యరాజుల స్థితి వేరుగ చెప్పవలెనా?! అది అత్యల్పముగ తోచును. సామాన్యముగ జనులు అందరికంటె గొప్పపదవిని పొందవలెనని, చక్రవర్తి పదవిని సంపాదింపవలెనని అభిలషించుదురు. సమయమంతయు దానికొరకై వ్యర్థముగ పాడుచేయుచుందురు. కాని అది అల్పమైనది. ఆత్మపదవి ఒకటియే అన్ని పదవులకంటె గొప్పది. సర్వోన్నతమగు అట్టి ఆత్మపదవి కొరకై మానవ జీవితమందలి ప్రతిక్షణమును వినియోగించి బ్రహ్మపదవిని పొంది ఆనందించుదురు గాక!

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

29. వాసనాతానవం రామ మోక్ష ఇత్యుచ్యతే బుధైః
పదార్థవాసనాదార్ఢ్యం బంధ ఇత్యభిధీయతే.

తా. విశ్వామిత్రుడు - ఓ రామచంద్రా! పదార్థములను గూర్చిన వాసనలు సన్నగిలుటయే మోక్షమనియు, దృఢపడుటయే బంధనమనియు పెద్దలు చెప్పుదురు.

వ్యాఖ్యానము - యోగవాసిష్ఠము నందు ముముక్షు ప్రకరణ అరంభములో విశ్వామిత్రుడు శ్రీ రామచంద్రుని కిట్లు బోధించెను. కోరిక దృఢపడిన కొలది వాసనగ పరిణమించును. వాసనలు ప్రయత్నము చేత, సాధన చేత క్షీణించి క్షీణించి అదృశ్యమై పోవును. వాసనల యొక్క క్షీణ స్థితియే మోక్షమని, అవి దృఢపడుటయే బంధనమని పెద్దలు చెప్పుదురని మహర్షి వక్కాణించెను. కాబట్టి ప్రయత్న పూర్వకముగ వాసనలను పోగొట్టు కొనవలెను. దీనినే వాసనాక్షయ మని కూడ పేర్కొందురు. అనేక జన్మలనుండి దృఢపడిన ఆ వాసనలు ఒక రాగాన నశించవు. పట్టుదలతో సాధన చేయవలెను. దృఢమైన పట్టుదలతో అక్కార్యమును సాధించవలెను. ఇతర జన్మలలో ఇది సాధ్యపడదు. ఒక్క మానవ జన్మ యందే అది సాధ్యమగును.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

30. ప్రత్యహం ప్రత్యవేక్షేత దేహం నశ్వరమాత్మనః
సంత్యజేత్ పశుభిస్తుల్యం శ్రయేత్ సత్పురుషోచితమ్.

తా. ప్రతిరోజు ఈ దేహము జడమైనదని, నశ్వరమైనదని, భావించవలెను. పశుతుల్యమైన దేహభావనను విడిచిపెట్టి సత్పురుషోచితమగు ఆత్మ భావనను చేపట్టవలెను.

వ్యాఖ్యానము - జీవుడు ఆత్మ స్వరూపుడేగాని జడమగు దేహము కాదు. ఈ సత్యమును పదేపదే చింతన చేయవలెను. అజ్ఞానులు తాము దేహమే అని భావించుదురు. కాని జ్ఞానులు ఏది సత్యమైనదో, ఏది మిథ్యయైనదో బాగుగ తెలుసుకొని సత్యవస్తువు నందే నిలకడ కలిగియుందురు. గురు సన్నిధిలోగాని, శాస్త్రపరిచయముతోగాని మానవుడు తన నిజస్వరూపమగు ఆత్మను, బ్రహ్మమును లెస్సగ అనుభూత మొనర్చుకొని తాను చైతన్యమగు ఆత్మయేకాని జడమగు దేహము కాదని, మరల మరల భావించు చుండవలెను పశుతుల్యమగు దేహ భావనను మానవుడు స్వీకరింపరాదు. మహోన్నతమగు మానవ జన్మను బడసి అల్ప చేష్టలకు లోను కాకూడదు. ప్రత్యహం - అని చెప్పుటవలన ప్రతిరోజు, ప్రతిక్షణము కూడ అహం బ్రహ్మాఽస్మి అని మననము చేయుచుండవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

31. స్వవివేక వశాదేవ విచార్యేదం పునః పునః
ఇంద్రజాలం పరిత్యాజ్యం స బాహ్యాభ్యన్తరం బలాత్.

తా. తనయొక్క వివేకము చేతనే ఈ జగత్తును గూర్చి మరల మరల విచారణ చేసి ఇంద్రజాలము వలె మిథ్యయగు అద్దానిని, బాహ్యాభ్యన్తరములను ప్రయత్నపూర్వకముగా పరిత్యజించ వలెను.

వ్యాఖ్యానము - ఆధ్యాత్మిక సాధనలన్నిటిలోను వివేకము చాలగొప్పది. వివేకము యొక్క సహాయము చేతనే ఏది సత్యమైనది, ఏది కల్పితమైనది మానవుడు గ్రహించగలడు. అట్టి వివేకముచే మానవుడు ఈ జగత్తును గూర్చి చక్కగ విచారించి మరల మరల చింతన జేసి బాహ్యాభ్యన్తర జగత్తు ఇంద్రజాలము (మిథ్యయని) అనిగ్రహించి దృశ్యజగత్తును త్యజించి తన నిజస్వరూపమగు ఆత్మను పరిగ్రహించి అద్దానియందు నిలకడ కలిగి ఆనందమును పొందవలెను. కనుకనే మోక్షసాధనలందు నిత్యానిత్యవస్తు వివేకమునకు అగ్రస్థానమివ్వబడెను.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

32. యది సర్వం పరిత్యజ్య
తిష్ఠస్యుత్క్రాన్త వాసనః
అమునైవ నిమేషేణ
తన్ముక్తోఽసి న సంశయః.

తా. శ్రీ వసిష్ఠమహర్షి - ఓ రామచంద్రా! సమస్తమును వదలి వాసనారహితుడవై యున్నచో ఈ నిముషమందే నీవు ముక్తుడవు కాగలవు. ఇందు ఏ మాత్రము సంశయము లేదు.

వ్యాఖ్యానము - (శ్రీ వసిష్ఠుడు) ఓ రామచంద్రా! సమస్తమును పరిత్యజించి వాసన లేవియు లేక ఎపుడు యుందువో ఆ నిముషమందే నీకు మోక్షము కరతలామలకమగును.'' - మోక్షమునకు వలసిన ప్రముఖమైన సాధనలు మూడింటిలో వాసనాక్షయమను ఈ సాధన మొట్టమొదటనే చెప్పబడినది. కాబట్టి ఆత్మేతరములగు పదార్థముల యెడల భావన లేక వాటినన్నిటిని పరిత్యజించి, ఏ కోరిక లేక యుండుచో ఆ క్షణమందే జీవుడు ముక్తుడై పోవును.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

33. మనోవిలయమాత్రేణ దుఃఖశాన్తిరవాప్యతే
మనోమనన మాత్రేణ దుఃఖం పరమవాప్యతే.

తా. మనస్సు విలయమొందినచో దుఃఖము నశించిపోవును. మనస్సు విజృంభించినచో మహా దుఃఖము కలుగును.

వ్యాఖ్యానము – అంతరేంద్రియములలో మనస్సు మొదటిది. మనస్సు వలననే ఈ జగత్తు యొక్క కల్పన ఏర్పడినది. మనస్సు నిశ్చలముగను, పవిత్రముగను యున్నచో జీవునకు పరమశాంతి కలుగును. ఆ మనస్సు అధిష్ఠానమగు ఆత్మ యందు ఎపుడు లయించి పోవునో అపుడు జీవునకు అపరిమితమగు శాంతి, సుఖము కలుగును. కాబట్టి మనస్సు యొక్క నిశ్చలత్వము కొరకై, నిర్మలత్వము కొరకై జీవుడు అనవరతము ప్రయత్నించవలెను. అనేక జన్మల నుండి మనస్సులో మాలిన్యము పేర్కొని పోయినది. దానిని ఈ జన్మలో తొలగించి వేయవలెను. అమనస్కస్థితిని సంపాదింప వలెను. మోక్షము యొక్క ఉనికి మనస్సుపైననే ఆధారపడి యున్నది.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోऽహం, సోऽహం, శివోऽహం, శివోऽహం –
చిదానందరూప శ్శివోऽహం శివోऽహం.

34. కృశోఽతిదుఃఖీ బద్ధోఽహం హస్తపాదాదిమానహమ్
ఇతి భావానురూపేణ వ్యవహారేణ బధ్యతే.

తా. నేను కృశించినవాడను, మహాదుఃఖవంతుడను, బద్ధుడను రెండు చేతులు, కాళ్ళు గలవాడను - అను ఇట్టి భావనచేత మనుజుడు బంధింప బడుచున్నాడు.

వ్యాఖ్యానము - మానవుడు అల్పుడు కాదు, అఖండమగు ఆత్మ స్వరూపము అతనిదై యున్నది. ఆనందసాగరమే అతడు. అట్టి మహోన్నత ఆత్మస్వరూపుడు 'తాను అల్పుడు - తాను దుఃఖిని' - అని భావించుట వెఱ్ఱియే యగును. మానవుడు పంచ భూతములతో చేయబడిన ఒక జడ స్వరూపము కాదు, పరిమితుడు కాదు, వికారవంతుడు కాదు. అతడు నిర్వికారుడు ఆకాశము కంటె సూక్ష్మమైన ఆత్మ స్వరూపుడు. కాబట్టి - నేను అల్పుడను, కృశించినవాడను - అని తనను కించిత్తు చేసు కొనరాదు. ప్రొద్దున లేవగనే - అహం బ్రహ్మోఽస్మి - అను మహావాక్యమును మననము చేయవలెను. - 'నేను బ్రహ్మమును, ఆత్మను - దేహమును కాను - అను ఇట్టి మహోన్నత భావములను చక్కగ మననము చేయవలెను. యద్భావం తద్భవతి.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

35. నాహం దుఃఖీ న మే దేహో బంధః కస్యాత్మనః స్థితః
ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే.

తా. నేను దుఃఖిని కాను, నాకు దేహము లేదు. ఆత్మకు బంధనమెట్లు కలుగును. - అను నిట్టి భావనల చేత మనుజుడు ముక్తుడగు చున్నాడు.

వ్యాఖ్యానము - కీటకము (పురుగు) తుమ్మెదను గూర్చి అనవరతము చింతన చేయుట చేత తుమ్మెదగనే అయిపోవునని పెద్దలు చెప్పుదురు. ఆ ప్రకారమే జీవుడు ఉదయము లేచినది మొదలు మరల పరుండువరకు నిరంతరము తన నిజస్వరూపమగు ఆత్మను గూర్చి చింతన చేయు చుండవలెను. ''ప్రాతఃస్మరామి హృది సంస్ఫురదాత్మతత్త్వం'' అని శ్రీ శంకరాచార్యులవారు - ప్రొద్దున లేవగనే తన హృదయమందు వెలుగు చున్న ఆత్మను గూర్చి చింతన చేయ చుండవలెనని ఆనతిచ్చిరి. కాబట్టి గురుముఖతః, శాస్త్రముఖతః జీవుడు ఆత్మజ్ఞానమును సంపాదించి అట్టి నిజస్వరూపమును గూర్చియే మననము చేయుచుండవలెను. అల్పత్వమును వహింపరాదు.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

36. న మోక్షో నభసః పృష్ఠే పాతాలే
న చ భూతలే
మోక్షో హి చేతో విమలం
సమ్యక్జ్ఞాన విబోధితమ్.

తా. మోక్షము అకాశమున లేదు, పాతాళమున లేదు, భూతల మందు లేదు. నిర్మలమైన మనస్సే మోక్షము. అట్టి నిర్మలత్వము సమాక్జ్ఞానము వలన కలుగును.

వ్యాఖ్యానము – అనేక జన్మల నుండి జీవుడు యథార్థ జ్ఞానము లేక పుట్టుచు చచ్చుచు జనన మరణ వలయములో చిక్కుకొని పోయినాడు. ఈ జన్మలో సద్గురువు నాశ్రయించి, సచ్ఛాస్త్రములను లెస్సగ అధ్యయనము చేసి జీవుడు యథార్థ జ్ఞానమును సంపాదింపవలెను. సద్గురువు 'తత్త్వమసి' అని బోధించును. అనగా నీవు ఆత్మ స్వరూపుడవు, బ్రహ్మ స్వరూపుడవు – అని తెలియ జేయును. పుణ్యకార్యముల చేత, నిష్కామ కార్యములచేత – అనేక జన్మలనుండి మనస్సుకు పట్టిన మాలిన్యమును తుడిచివేయవలెను. అపుడు మోక్షము దానంతట అదియే వచ్చిచేరును. మనస్సు యొక్క శుద్ధతమే మోక్షమునకు ఏకైక ఉపాయము.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

37. శ్రూయతాం జ్ఞానసర్వస్వం శ్రుత్వా చైవావధార్యతామ్
భోగేచ్ఛామాత్రకో బన్ధః తత్త్యాగో మోక్ష ఉచ్యతే.

తా. శ్రీ వసిష్ఠ మహర్షి ఆధ్యాత్మిక సభాసదుల నుద్దేశించి ఈ వాక్యములను చెప్పిరి - ఓ జనులారా! జ్ఞానము యొక్క సర్వస్వమును చెప్పుచున్నాను వినుడు. విని ఆచరింపుడు. - భోగముల యెడల కోరికయే బంధము, భోగేచ్ఛను విడనాడుటయే మోక్షము.

వ్యాఖ్యానము - జ్ఞాన సర్వస్వమును, సారమును వసిష్ఠ మహర్షి ఇట్లు చెప్పిరి - భోగేచ్ఛను విడుచుటయే మోక్షము, కలిగియుండుటయే బంధము. ఎపుడు మనుజుడు భోగేచ్ఛను విడనాడునో, వాసనలను పారద్రోలునో అపుడు మనస్సు నిర్మలమై యుండును. మనస్సు విశుద్ధ సత్త్వగుణమును బడసినపుడు అధిష్ఠానమగు ఆత్మయందు విలీనమై పోవును. అంతట మనుజునకు పరమానందము, పరమ శాంతి సిద్ధించును. అదియే మోక్షస్థితి. అట్టి స్థితి యనగా ఒక వస్తువును బడయుట కాదు. మనోమాలిన్యమును పోగొట్టుకొనుటయే.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

38. కోహం కథమిదం చేతి యావన్న ప్రవిచారితమ్
సంసారాడంబరం తావత్ అంధకారోపమం స్థితమ్.

తా. నేనెవడను? ఈ జగత్తు ఎట్లేర్పడినది? - అని విచారింపనంతవరకు ఈ సంసారము. అంధకార బంధురమై యుండును.

వ్యాఖ్యానము - మనుజుడు ఈ ప్రపంచములో ఎన్నియో వ్యవహారములను సలుపు చున్నాడేగాని ముందు తానెవరో తెలుసుకొనుట లేదు. ఈ జగత్తు ఎట్లేర్పడినదో తెలుసుకొనుట లేదు. మనుజుడు శుద్ధ బోధ స్వరూపుడే గాని, ఆత్మ స్వరూపుడేగాని జడమైన ఒక దేహము కాదు. అట్లు తెలుసుకొనక అజ్ఞానములోపడి వ్యవహారము సలుపు చున్నాడు. తత్ఫలితముగ దుఃఖమును బడయు చున్నాడు. ఈ జగత్తు - ఇంద్రియములు, మనస్సు మున్నగు వానితో కూడిన ఉపాధివలన ఏర్పడినది. ఇది కల్పితమైనది. త్రికాలములందును సత్యమైన ఆత్మయే మనము ఆశ్రయింప దగినది. వేదాంతము యొక్క సారమంతయు మూడు వాక్యములలో చెప్పవచ్చును. 1. కోఽహం, 2. నాఽహం, 3. సోఽహం. అనగా 1. నేనెవడను? 2. ఈ దృశ్యవస్తువు నేను కాదు. 3. ఆత్మయే నేను. తరింప గోరువాడు ఈ మహోన్నత సత్యములను నిరంతరము మననము చేయు చుండవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

39. సర్వగాత్మాహమేవేతి నిశ్చయో యో మహామతే
తమాదాయ విషాదాయ న భూయో యాతి మే మతిః.

తా. శ్రీ వసిష్ఠమహర్షి శ్రీ రామచంద్రునకు ఈ మహత్తర సత్యములను ఉద్బోధించెను - ''ఈ జగత్తంతయు ఆత్మయే. ఆ ఆత్మయే నేను'' - అను నిశ్చయము కలిగియుండుట వలన నా మనస్సు మరల దుఃఖము నెన్నటికి పొందుటలేదు.

వ్యాఖ్యానము - యథార్థముగ ఈ జగత్తంతయు ఆత్మయందు కల్పింపబడియున్నది. ఈ మహోన్నత సత్యమును తెలుసుకొనినవానికి ఇక దుఃఖమెన్నటికిని కలుగదు. అంతయు తన స్వరూపమే అయియుండుట వలన ఈ జగత్తులో మిత్రుడెవరు? శత్రువెవరు? కనుక ఆత్మజ్ఞానికి దుఃఖమెన్నటికిని కలుగదు. వసిష్ఠుడు బోధించిన ఈ పరమసత్యములను జనులు మరల మరల మననము చేయవలెను. దుఃఖరాహిత్యమునకు ఇది చక్కని ఉపాయము. తాను ఆత్మ స్వరూపుడని గ్రహించుట, జగత్తు మనస్సు యొక్క కల్పన అని గ్రహించుట - అను ఈ రెండును వేదాంతసారము అని చెప్పవచ్చును.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

40. ధనదారేషు వృద్ధేషు దుఃఖం యుక్తం న తుష్టయః
వృద్ధాయాం మోహమాయాయాం కస్సమాశ్వాసవానిహ.

తా. ధనము, భార్య మున్నగునవి వృద్ధినొందినపుడు దుఃఖించుటయే యుక్తముగాని సంతుష్టినొందుట కాదు. మోహమాయ వృద్ధియై నపుడు ఎవనికి శాంతి కలుగును ?

వ్యాఖ్యానము – సామాన్యముగ జనులకు ధనముగాని, భార్యా పుత్రాదులు గాని, బంధువులు గాని వృద్ధినొందినపుడు సంతోషముతో పొంగి పోవుదురు. కాని అది అజ్ఞానము వలన ఏర్పడిన అభిప్రాయమే కాని మరొకటి కాదు. అది అనుభవపూర్వకముగ కలిగిన అభిప్రాయము కాదు. దార అనగా భార్య. ధనదారాదులన్నియు మోహమాయకు చెందినవి. అవి పెరిగినచో మాయవృద్ధి నొంది ఇక జీవునకు శాంతి కలుగుటకు ఆస్కారమే లేదు. అయితే వాటిని తొలగించమని కాదు, పరిమితముగ వ్యవహరింపవచ్చును. ప్రభుత్వము వారు కూడ పరిమిత కుటుంబమునే ప్రోత్సహించు చున్నారు.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

41. శైవాలమాత్రాపనయే పిపాసోః
కార్యః ప్రయత్నో న తు తోయసిద్ధ్యై
తస్మిన్నపేతే సహజం హి తోయం
శుద్ధం ప్రసన్నం విషయత్వమేతి.

తా. నీరు త్రాగుటకై చెఱువు యొద్దకు వచ్చినవాడు నీటిని సృష్టి చేయవలసిన పనిలేదు, పాచిని తొలగించిన చాలును. వెంటనే సహజముగనే స్వచ్ఛమైన నీటి యొక్క దర్శనమగును.

వ్యాఖ్యానము – చెఱువు నందు స్వతస్సిద్ధముగనే నీరు యున్నది. దానిని మరొకచోట నుండి తేవలసిన పనిలేదు. నీటిని కప్పియున్న పాచిన తొలగించిన వెంటనే శుద్ధమైన నీటియొక్క దర్శనమగును. అపుడు దానిని త్రాగి తృప్తి నొందవచ్చును. అట్లే ఆత్మ జీవుని యందు స్వతస్సిద్ధముగ యుండనే యున్నది. దానిని క్రొత్తగ తేవలసిన పనిలేదు. దానిని కప్పివేసిన మనస్సును, వాసనలను, అవిద్యను ప్రయత్నముతో తొలగించిన మాత్రముననే ఆత్మ శేషించును. అనేక జన్మల నుండి విషయ వికారములు మనస్సు నందు రూఢిపడి యున్నవి. అవి ఒక రాగాన పోవు. సాధనలచేత ప్రయత్న పూర్వకముగ వాటిని తొలగించవలెను. అపుడు ఆత్మానుభూతి చక్కగ కలుగును.

### ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

42. న సాక్షిణం సాక్ష్యధర్మాః సంస్పృశన్తి విలక్షణమ్
అవికారముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్.

తా. ఇంటిలో దీపము వెలుగు చున్నది. ఇంటిలోని వస్తువులన్నిటిని అది ప్రకాశింప జేయుచున్నది. ఆ వస్తువుల యొక్క ధర్మములు సాక్షియగు దీపమును స్పృశింప నేరవు. దీపము నిర్వికారముగను, తటస్థముగను యున్నది.

వ్యాఖ్యానము – ఇంటిలోని వస్తువులను దీపము ప్రకాశింప జేయుచున్నది. దీపము సాక్షి. సాక్షియగు దీపమును ఇంటిలోని వస్తువుల యొక్క ధర్మములు, అనగా సాక్ష్య ధర్మములు ఏ మాత్రము తాకజాలవు. అవి దీపమునకు విలక్షణముగ యుండును. దీపము నిర్వికారముగ నుండి తాను ప్రకాశించుచు ఇంటిలోని వస్తువులను ప్రకాశింప జేయు చుండును. అట్లే ఆత్మ తాను నిర్వికారముగ ప్రకాశించుచు జగత్తంతటిని ప్రకాశింప జేయుచున్నది. జగత్తు యొక్క వికారములు ఆత్మను ఏ మాత్రము స్పృశింపనేరవు. మనుజుడు తాను నిశ్చలమగు ఆత్మయే యని జగత్తు యొక్క ధర్మములతో తనకే మాత్రము సంబంధము లేదని భావించుచు 'సోహం, సోహం' అని ఎలుగెత్తి పాడవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

43. నాహం మనుష్యో న చ దేవయక్షౌ
న బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రాః
న బ్రహ్మచారీ న గృహీ వనస్థో
భిక్షు ర్న చాహం నిజబోధరూపః.

తా. హస్తామలకుడు అను బాలకుడు శ్రీ శంకరాచార్యులవారితో పలికిన వాక్యములివి. - నేను మనుష్యుడను కాను, దేవతను కాను, యక్షుడను గాను; బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు, బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, భిక్షువు - ఇవేవియు నేను కాను. శుద్ధ బోధస్వరూపమగు ఆత్మయే నేను.

వ్యాఖ్యానము - శ్రీ శంకరాచార్యులవారు హస్తామలకుడను బాలకుని 'నీవెవడవు? - అని ప్రశ్నించినపుడు అతడు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను. ఉపాధికి సంబంధించిన జాతిమతము లేవియు నాకు లేవు. నేను ఉపాధికి సాక్షియైన ఆత్మను. బహు జన్మలందు చేసిన సాధనల యొక్క పరిణామముచే హస్తామలకునకు ఈ మానవజన్మలో చక్కని ఆత్మ జ్ఞానము కలిగెను. అరచేతిలోని ఉసిరికాయ ఎంత ప్రత్యక్షముగ కనుపించునో అంత ప్రత్యక్షముగ అతడు ఆత్మను దర్శించెను కనుక గురుదేవుడు అతనికి హస్తామలకుడు అని పేరు పెట్టెను.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

44. త్రిషుధామసు యద్భోజ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్
తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః.

తా. జాగ్రత్స్వప్న సుషుప్తులందు గల భోజ్యము భోక్త, భోగము - అను వాటి కంటె నేను విలక్షణుడను, సాక్షిని, చిన్మాత్రుడను, సదాశివుడను.

వ్యాఖ్యానము - ఇది ఉపనిషద్వాక్యము. మానవుని యొక్క యథార్థ స్వరూపము ఇచట స్పష్టముగ తెలుపబడినది. జాగ్రత్స్వప్న సుషుప్తులు వచ్చుచు పోవుచుండును. కాని ఆత్మ ఆ మూడింటిని ప్రకాశింప జేయుచు నిర్వికారముగ యుండును. అట్టి నిర్వికార మగు ఆత్మయే నేనని జాగ్రదాదులను తాను ప్రకాశింప చేయు చున్నానని మానవుడు భావించవలెను. ఈ ప్రకారముగ తన యొక్క యథార్థ స్వరూపమును ప్రతిదినము చింతన చేయు చుండుట వలన జీవునకు స్వస్వరూప జ్ఞానము లెస్సగ గలిగి ఆత్మానుభూతి సిద్ధించును.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

45. మయ్యేవ సకలం జాతం మయిసర్వం ప్రతిష్ఠితమ్
మయిసర్వం లయం యాతి తద్బ్రహ్మాఽద్వయ మస్మ్యహమ్.

తా. నేను అద్వయబ్రహ్మమును. నాయందే జగత్తంతయు పుట్టు చున్నది, స్థితి కలిగియున్నది, లయించుచున్నది.

వ్యాఖ్యానము – నేను ఆత్మ స్వరూపుడను, బ్రహ్మ స్వరూపుడను. ఈ జగత్తు యొక్క సృష్టి స్థితి లయములు నాయందే జరుగుచున్నవి. నేను అల్పుడను కాను, బలహీనుడను కాను. చిదాకాశమే నేను. ఆకాశమందు మేఘముల వలె నా యందు ఈ జగత్తులు ఆవిర్భవించుచున్నవి. కొంతకాలము స్థితికలిగి మరల లయించు చున్నవి. ఈ జగత్తుయందలి ప్రతి ప్రాణియు బ్రహ్మస్వరూపమే. కాబట్టి ఎవరును తనను అల్పునిగ తలంపక ప్రతిప్రాణియు తనవంటిదే అని భావించుచు ప్రేమ, దయ, కరుణ కలిగి యుండవలెను. జీవితమును ప్రేమమయముగ ఒనర్పవలెను. ఎవరినీ ద్వేషింపరాదు, బాధింపరాదు. ఇట్టి విశాల భావములు కలిగియున్నపుడే దేశము రామరాజ్యమై విలసిల్లగలదు.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

46. ఆత్మాతు సతతం ప్రాప్తో౽ ప్యప్రాప్త వదవిద్యయా
తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా.

తా. ఆత్మ ఎల్లపుడు పొందబడియే యున్నది. పొందబడనట్లు అవిద్యవలన తోచుచున్నది. ఆ అవిద్య నశించినపుడు స్వకీయ కంఠాభరణము వలె తిరిగి పొందబడినట్లు తోచుచున్నది.

వ్యాఖ్యానము - అజ్ఞాని తాను ఆత్మకాదని తాను జడమైన దేహమని తలంచు చున్నాడు. అతడు అవిద్య చేత ఆవరింప బడియున్నాడు కనుక అట్లు పలుకు చున్నాడు. ఆ అవిద్య తొలగిపోయినపుడు తన నిజస్వరూపమును తెలుసుకొని జీవు డెంతయో ఆనందపడును. ఒకరు కంఠాభరణమును ధరించి పైన వస్త్రమును కప్పుకొని ఆభరణము ఎక్కడనో పడిపోయినదని విలపించునట్లును, వస్త్రము తొలగించిన పిదప ఆభరణము తన కంఠమందే యుందని తెలుసుకొని అనందించునట్లు - జీవుడు గురుముఖతః శాస్త్రముఖతః తాను ఆత్మయే యని తెలుసుకొని బ్రహ్మానందమున ఓలలాడు చుండును. కాబట్టి సత్యవిషయమును గురువు ద్వారా శాస్త్రముల ద్వారా తెలుసుకొనవలెను. తెలుసుకొని పరమానందము నొందవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సో౽హం, సో౽హం, శివో౽హం, శివో౽హం -
చిదానందరూప శ్శివో౽హం శివో౽హం.

47. బాహ్యే నిరుద్ధే మనసః ప్రసన్నతా
మనః ప్రసాదే పరమాత్మ దర్శనమ్
తస్మి న్సుదృష్టే భవబంధనాశో
బహిర్నిరోధః పదవీ విముక్తేః.

తా. బాహ్య విషయములు తొలగగా మనస్సు నందు నిర్మలత్వము ఏర్పడును. నిర్మల మనస్సు నందు పరమాత్మ గోచరమగును. తత్ఫలితముగ సంసార బంధములు తొలగును. కాబట్టి బాహ్య విషయములు తొలగిపోవుటయే మోక్ష పదవికి సులభమార్గము.

వ్యాఖ్యానము - నాకు మోక్షము కావలెను, నేను మోక్షపదవిని పొంద వలెను - అని పలువురు తలంచుదురు. మోక్షపదవిని పొందుటకు ఇచట సులభపద్ధతి చెప్పబడినది. అనేక జన్మల నుండి విషయ సంస్కారములు, వాసనలు, బలపడి మనస్సు నందు గూళ్ళు కట్టుకొని జీవుని బాధించుచున్నవి. వివేక బలము చేత, వైరాగ్య బలము చేత వాటినన్నిటిని జయించి మనస్సును అంతర్ముఖము చేయవలెను. ఆ అపవిత్ర సంస్కారము లన్నియు తొలగి పోయినపుడు మనస్సు పవిత్రమగును. నిర్మల అద్దమునందు ముఖము చక్కగ కనపడునట్లు పవిత్రమనస్సు నందు పరమాత్మ దర్శనమగును. ఆత్మానుభూతి చక్కగ కలుగను. అత్తటి సంసార బంధము లన్నియు విచ్ఛిన్నమై మోక్షము చేకూరును.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

48. శుద్ధోఽసి బుద్ధోఽసి నిరంజనోఽసి
సంసారమాయా పరివర్జితోఽసి
సంసారమాయా త్యజ మోహనిద్రాం
మదాలసా పుత్ర మువాచ వాక్యమ్.

తా. మదాలస అను రాణి తన బిడ్డలకు ఉగ్గుపాలతోనే ఆత్మవిద్యను ఉపదేశించుచు ఈ ప్రకారముగ బోధించెను. నాయనా! నీవేల ఏడ్చుచున్నావు? నీవు ఏడ్చువాడవు కాదు. నీవు శుద్ధుడవు బుద్ధుడవు, నిరంజనుడవు, సంసారమాయ లేనివాడవు, సంసార మాయను వదలి అజ్ఞాన నిద్రనుండి మేల్కొనుము.

వ్యాఖ్యానము – చంటిపిల్లవాడు ఏడ్చునపుడు సామాన్యముగ తల్లులు ఏవేవో జోలపాటలను పాడుదురు. అర్థరహితములైన పాటలను పాడుదురు. కాని మదాలస అను రాణి తాను తత్త్వజ్ఞానమును చక్కగ తెలుసుకొని తన పిల్లలకు బాల్యకాలమందే ఆ విద్యను బోధించెను. చిన్నకాలమందే ఆత్మవిద్యను తెలుసుకొని ఆ పిల్లలు పెద్దయిన పిదప ఏకాంతమునకు పోయి తపస్సు చేసి తరించిరి. తల్లిదండ్రులు ఆత్మవిద్యను గూర్చిన పరిచయము కలిగి బాల్యకాలమందే ఆ విద్యను పిల్లలకు బోధించి తాము తరించి ఇతరులను తరింప జేయవలెను. ఆత్మవిద్యను పొందినచో జనకమహారాజు వలె నిస్సంగముగ వ్యవహరింప వచ్చును.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

49. శుద్ధోఽసి రే తాత న తేఽస్తి నామ
కృతం హి తే కల్పనయాఽధునైవ
పంచాత్మకం దేహమిదం న తేఽస్తి
నైవాసి త్వం రోదిషి కస్యహేతోః.

తా. పూర్వము మదాలస అను రాణి తన కుమారుడు ఏడ్చుచుండగా ఊయలలో పరుండపెట్టి ఇట్లు జోలపాట పాడెను - నాయనా! నీవు శుద్ధుడవు, నామరూపములు లేనివాడవు. ఈ నామ రూపవములు కేవలవము కల్పింపబడినవే యగును. పంచభూతాత్మకమగు ఈ దేహము నీకు వాస్తవముగ లేదు. ఇక నీవేల ఏడ్చుచున్నావు?

వ్యాఖ్యానము - సామాన్యముగ కొందరు ఆధ్యాత్మిక విషయములను ముసలి తనము వరకు వాయిదా వేయుచుందురు. అది చాల పొరపాటు. బాల్య కాలము నుండియే ఆధ్యాత్మిక విషయముల యొక్క పరిచయము కలిగియుండవలెను. చిన్నప్పటి నుండియే భక్తి జ్ఞానవైరాగ్యములను అభ్యసింపవలెను. 'ఆబాల్యాత్ -' బాల్య కాలము నుండియే సాధనము చేయవలెనని శ్రీ వసిష్ఠుడు శ్రీరామునకు బోధించెను. శ్రీరామునకు 16 సం. వయస్సు నందే యోగవాసిష్ఠమను మహోత్కృష్టమగు ఆధ్యాత్మిక గ్రంథమును శ్రీ వసిష్ఠుడు బోధించెను. కనుక చిన్నప్పటి నుండియే తానెవరో ఈ జగత్తెట్లేర్పడినదో గురు, శాస్త్రముఖతః చక్కగ ఎరుగవలెను.

ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

50. దేహబుద్ధ్యాతు దాసోఽహం జీవబుద్ధ్యా త్వదంశకః
ఆత్మబుద్ధ్యా త్వమేవాహం ఇతి మే నిశ్చితామతిః.

తా. శ్రీ రాముడు అంజనేయునకు అధ్యాత్మిక విషయములన్నిటిని బోధించి తుట్టతుదకు నీవేమి గ్రహించితివని అడుగగా అంజనేయుడు చెప్పిన ప్రత్యుత్తరమిది - నేను దేహమని ఎప్పుడైన తలంచినచో అపుడు మీ యొక్క దాసానుదాసుడను. నేను జీవుడనని తలంచినచో మీ యొక్క ఒకానొక అంశమును. నేను ఆత్మను అని తలంచినచో అపుడు మీరే నేను - అని నా బుద్ధి నిశ్చయించినది.

వ్యాఖ్యానము - మతము ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత రూపములుగ 3 విధములుగ యుండును. ద్వైతమందు జీవుడు దేవుని కంటె వేరుగ యుండును. అపుడు దేవునకు భక్తితో నమస్కరించు చుండును. విశిష్టాద్వైతమందు తరంగము సముద్రము యొక్క ఒక అంశముగ యుండునట్లు జీవుడు దేవుని యొక్క ఒకానొక అంశముగ యుండును. అద్వైతము నందు జీవునకు దేవునకు భేధమేమియు యుండదు. సాధకుడు క్రమక్రమముగ ఊర్ధ్వస్థితిని పొందుచు అహం బ్రహ్మాస్మి - అని చివరకు బ్రహ్మముగనే పరిణమించును. సాధ్యము ప్రయత్నాతిశయముచే ఒక్కొక్క మెట్టు పైకి పోయి తుట్టతుదకు సాక్షాత్ పరబ్రహ్మమునందు విలీనమై పోవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

51. వాచావక్తుమశక్యమేవ మనసా మన్తుం న వా శక్యతే
స్వానందామృత పూరపూరిత పరబ్రహ్మాంబుధేర్వైభవమ్
అంభోరాశి విశీర్ణ వార్షిక శిలాభావం భజన్మే మనో
యస్యాంశాంశలవే విలీన మధునాఽఽ నందాత్మనా నిర్వృతిమ్.

తా. శ్రీ శంకరాచార్యులవారు ఒకానొక శిష్యునకు వేదాంతతత్త్వమును క్షుణ్ణముగ బోధింపగా అదియంతయును విని శిష్యుడు తన అనుభవమును ఇట్లు వెల్లడించెను. ఆహా! బ్రహ్మానందము యొక్క వైభవమును నేను వాక్కు చేతగాని, మనస్సు చేతగాని వర్ణింపలేను. అది వర్ణనాతీతము. సముద్రమునందు వడగల్లు పడి ఎట్లు విలీనమైన పోవునో అట్లే నా మనస్సు బ్రహ్మానంద సాగరమందు విలీనమై పోయినది.

వ్యాఖ్యానము - బ్రహ్మము (ఆత్మ) వర్ణనాతీతము. దానిని అనుభవింప వలసినదే గాని వర్ణింపశక్యము కాదు. వాక్కుగాని, మనస్సు గాని బ్రహ్మమును చేరలేక వెనుకకు మరలిపోవును. ''యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ'' అని ఉపనిషత్తులు ఈ భావమునే చక్కగ వర్ణించినవి. కాబట్టి సాధకులు బ్రహ్మమును అనుభవ పూర్వకముగ తెలుసుకొని ఆనంద సాగరములో విలీనులై బ్రహ్మానందమును పొందుదురు గాక!

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

52. కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిమ్
యన్మయా పూరితం విశ్వం మహాకల్పాంబునా యథా.

తా. గురుబోధను సంపూర్ణముగ విని శిష్యుడిట్లు చెప్పెను. - ఈ ప్రపంచమంతయు నాలో కల్పింపబడియున్నది. ఇక నేనేమి చేయుదును? ఎచటికి వెళ్ళుదును? దేనిని గ్రహించుదును? దేనిని వదులుదును? ఈ విశ్వమంతయు మహాకల్పాంత సముద్రము వలె నా చేత పూరింపబడి యున్నది.

వ్యాఖ్యానము - ప్రపంచము వేరుగ లేదు. ఆత్మయందే కల్పింపబడి యున్నది. బ్రహ్మాండమంతయు తనలోనే యున్నపుడు ఇక తానెచటకు వెళ్ళగలడు? ఏమి చేయగలడు? దేనిని గ్రహించ గలడు? దేనిని త్యజించ గలడు? మహాకల్పాంత సముద్రము వలె ఈ విశ్వమంతయు తన చేతనే వ్యాపింప బడియున్నది. ఇట్టి అనుభూతి కలిగినవాడు ఏ ప్రాణిని హింసింపడు, ఏ ప్రాణికి అపకారము చేయడు. ఒక చేయి మరొక చేతిని కొట్టునా?! ఇట్టి ఆత్మౌపమ్య స్థితిని పొందినవాడు ధన్యుడు కృతకృత్యుడు. మహోన్నతమైన ఇట్టి ఆత్మానుభూతిని బడయుటకై సాధకులు లెస్సగ కృషి చేయవలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

53. యత్సౌఖ్యాంబుధి లేశలేశత ఇమే శక్రాదయో నిర్వృతా
యచ్చిత్తే నితరాం ప్రశాన్తకలనే లబ్ధ్వా ముని ర్నిర్వృతః
యస్మిన్నిత్యసుఖాంబుధౌ గళితధీః బ్రహ్మైవ న బ్రహ్మవిత్
యఃకశ్చిత్ ససురేంద్రవందితపదం నూనం మనీషా మమ.

తా. శ్రీ శంకరాచార్యులవారు తమ మనీషాపంచకము నందు ఈ ప్రకారముగ తెలిపిరి. ఏ బ్రహ్మానందసాగరము యొక్క లవలేశముచే ఇంద్రుడు మున్నగువారు సంతుష్టిని పొందిరో, ఏ బ్రహ్మమునందు తమ చిత్తము లీనమగుటచే మునులు పరమశాంతిని పొందిరో; ఏ బ్రహ్మము నందు తమ బుద్ధి లయమగుటచే బ్రహ్మవేత్తలు సాక్షాత్ బ్రహ్మ స్వరూపులయిరో - అట్టి బ్రహ్మపదము ఇంద్రునకు కూడ వందనీయమని నా అభిప్రాయము.

వ్యాఖ్యానము - సామాన్యులు విషయ సుఖముల ననుభవించి, స్వల్పమగు ఆనందమును పొంది మురిసి పోవుచుందురు. బ్రహ్మానందమట్టిది కాదు. అది ఒక మహా సముద్రము వంటిది. ఎవరి చిత్తముగాని, బుద్ధి గాని, మనస్సు గాని ఆ బ్రహ్మమునందు విలీనమగునో వారికి లభించు ఆనందము అపారము. మనుష్యానందము కంటె చక్రవర్తి ఆనందము గొప్పది, దానికంటె ఇంద్రానందము గొప్పది. అట్టి ఇంద్రుడు బ్రహ్మానందముతో పోల్చినచో తాను అనుభవించు ఆనందము అత్యల్పమైనదని పలుకును. కనుక అట్టి బ్రహ్మానందము కొరకై ఆత్మవిచారణ సలిపి ఈ జీవితమందే అద్దానిని బడసి పరమశాంతి నొందుదురు గాక!

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

54. అహర్నిశం యత్పరిచిన్తనీయం
సంసారమిథ్యాత్వ శివాత్మతత్త్వమ్.

తా. శ్రీ శంకరులు తమ ప్రశ్నోత్తరమణిరత్నమాల యందు ఈ ప్రకారముగ తెలిపిరి.

ప్రశ్న - రాత్రింబగళ్ళు దేనిని గూర్చి చింతన చేయవలెను?

జవాబు - ఈ ప్రపంచము యొక్క మిథ్యాత్వమును గూర్చియు, ఆత్మ తత్త్వమును గూర్చియు చింతన చేయవలెను.

వ్యాఖ్యానము - సామాన్యముగ జనులలో కొందరు కబుర్లతోను, వ్యర్థకాల క్షేపములతోను తమ జీవితములను గడిపి వేయుచుందురు. అది చాల పొరపాటు. మానవ జీవితము మహాదుర్లభము. దానిని వృథాగ గడుపరాదు. ''నీయతే తద్వృథాయేన ప్రమాద స్సుమహానహో'' - మానవ జీవితమును వృథాగ గడిపివేయుట మహాప్రమాదకరమని శ్రీ వసిష్ఠుని అభిప్రాయము - ఈ నామరూపాత్మక జగత్తు కేవలము కల్పితమని, ఆత్మ ఒకటే శాశ్వతమని, తాము ఆ ఆత్మయే అని నిరంతరము చింతన చేయు చుండవలెనని శ్రీ శంకరులు తెలిపియున్నారు. కనుక నిరంతరము శివోఽహం శివోఽహం అని ఎలుగెత్తి పాడుచు ఈ కల్పిత జగత్తున విషయ భోగములకు దూరముగ యుండుచు సత్యమగు ఆత్మను అనుభవించుటకై అహర్నిశములు సాధన చేయు చుండవలెను. క్రమముగ ఆత్మానుభూతిని బడసి జీవితమును సార్థక మొనర్చు కొనవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

55. బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్
ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం స్వాత్మరూపం నమామి.

తా. బ్రహ్మానందమును, పరమసుఖ ప్రదమును, కేవలము జ్ఞాన స్వరూపమును, ద్వంద్వాతీతమును, ఆకాశసదృశమును, తత్త్వమస్యాది మహావాక్యముల లక్ష్యమును, ఏకమును, నిత్యమును, నిర్మలమును, నిశ్చలమును, సమస్త బుద్ధులకు సాక్షియును, భావాతీతమును, త్రిగుణరహితమును - అగు స్వాత్మరూపమునకు నమస్కారము.

వ్యాఖ్యానము - ఆత్మ ఎట్టిదియో ఈ శ్లోకమునందు చక్కగ తెలిపి యున్నారు. ఆనందమే అద్దాని స్వరూపము. దానిని అనుభూత మొనర్చుకొనుటకై జీవుడెంతయో సాధన చేయవలెను. ప్రాపంచిక విషయముల యెడల విరక్తి కలిగి స్వస్వరూపమగు ఆత్మను గూర్చి నిరంతరము విచారణ చేయవలెను. ఆత్మ ఎక్కడనో లేదు. తన హృదయమందే విలసిల్లు చున్నదని తెలుసుకొని ధ్యానమును చక్కగ అభ్యసించి ఆ ఆత్మను తనయందే అనుభూత మొనర్చు కొనవలెను. మహోన్నతమైన మానవ జీవితమును విషయ భోగములందు గడుపరాదు.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

56. కిం నామ రోదిషి సఖే త్వయి సర్వశక్తిః
అమంత్రయస్వ భగవన్ భగదం స్వరూపమ్
త్రైలోక్యమేతదఖిలం తవ పాదమూలే
ఆత్మైవహి ప్రభవతి న జడః కదాచిత్.

తా. శ్రీ వివేకానందస్వాములవారు ఈ శ్లోకమును చెప్పి యున్నారు. దీని భావమేమనగా - ''సోదరా! ఏల ఏడ్చుచున్నావు? నీ యందు అఖండమైన శక్తి గలదు. ఆ అనంత శక్తిని ఒక్కసారి ఆహ్వానింపుము. ముల్లోకములు నీ పాదముల యొద్దనే యున్నవి. నీ స్వరూపము చైతన్యవంతమేగాని జడమైనది గాదు.

వ్యాఖ్యానము - సామాన్యముగ జనులలో పెక్కురు తమ నిజస్వరూపమను తెలియ జాలక జడమగు దేహమే తామని భావించి దుఃఖించు చున్నారు. అది పొరపాటు. జీవుని యథార్థస్వరూపము ఆత్మయే. అది ఒక మట్టిముద్ద కాదు. బ్రహ్మానందసాగరమే అతని జన్మహక్కు. ఆత్మవిచారణ చక్కగ సలిపి తానెవరో తన వాస్తవ స్వరూపమేదియో బాగుగ తెలుసుకొని ఆత్మానుభూతిని బడసి మానవ జీవితమును సార్థక మొనర్చుకొనవలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

57. పృథగాత్మా పృథగ్దేహో జలపద్మలవస్థితౌ
ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష న చ కశ్చిచ్ఛృణోతి తత్.

తా. అనుభవజ్ఞుడగు ఒకానొక మహర్షి ఇట్లు చెప్పెను - జలము, పద్మముల వలె ఆత్మ, దేహములు రెండును వేర్వేరుగ యున్నవని రెండు చేతులు పైకెత్తి చెప్పినప్పటికిని ఎవరును వినుట లేదే!

వ్యాఖ్యానము - కమలము నీటిలో పుట్టినప్పటికి నీటి కంటె వేరుగ యుండును. అట్లే శరీరము ఆత్మచేత ప్రకాశింప జేయబడినప్పటికి ఆత్మకంటె వేరుగ యున్నది. ఇల్లు దీపము చేత ప్రకాశింప జేయబడినను ఇల్లుగాని, ఇంటిధర్మములు గాని దీపమును అంటనేరవు. ఈ శరీరము క్షేత్రము. క్షేత్రజ్ఞుడగు ఆత్మ క్షేత్రమును ప్రకాశింప జేయుచు దానికంటె వేరుగ యున్నది. అజ్ఞానులు ఆత్మ యొక్క ధర్మములను దేహముపై అరోపించుకొనుచు జడమైన దేహమును చైతన్యవంతముగ భావించుచున్నారు. అట్లుకాక తాను చైతన్య వంతమగు ఆత్మయే యనియు, జడమగు దేహము తన కంటె వేరుగ యున్నదనియు ఎరింగినచో ఎంతయో శాంతి సుఖములు జీవునకు కలుగును.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

58. ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.

తా. భగవద్గీత యందు శ్రీ కృష్ణపరమాత్మ అర్జునునకిట్లు బోధించెను. ఓ అర్జునా! ఆత్మ బుద్ధి కంటె పరమై యున్నదని తెలుసుకొని వివేక యుక్తమగు బుద్ధిచేత మనస్సును నిగ్రహించి జయించుటకు కష్ట సాధ్యమైనట్టి కామమను శత్రువును జయించివేయుము.

వ్యాఖ్యానము - ఇంద్రియముల కంటె మనస్సు గొప్పది, మనస్సు కంటె బుద్ధి గొప్పది. బుద్ధికంటె ఆత్మ గొప్పది. ఆత్మ బుద్ధికి సాక్షిగ యున్నది. వ్యష్టి ఉపాధి, సమష్టి బ్రహ్మాండము అంతయు ఆత్మ చేత ప్రకాశింప జేయుబడు చున్నది. ఆత్మ బుద్ధికంటె అతీతముగ యున్నదని తెలుసుకొని ఆత్మయందు స్థితికలిగి దేహాది ప్రపంచము నంతను సాక్షిగ వీక్షించవలెను. వేదాంత శాస్త్రమునందు మూడు ప్రధాన సాధనలు గలవు. తత్త్వ జ్ఞానము, వాసనాక్షయము, మనోనాశము. ఈ శ్లోకమందు తత్త్వ జ్ఞానము చేత వాసనాక్షయ మెట్లు కలుగునో చెప్పబడినది. వాసనాక్షయము చేత మనోనాశము సంభవించును. మనోనాశము చేత ఆత్మానుభూతి సిద్ధించును. అదియే మోక్షము.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

59. బ్రహ్మాదిస్థావరాంతేషు శరీరేషు యదేకం చైతన్యమస్తి తదేవాహమస్మీతి దృఢజ్ఞాన సిద్ధిర్భూయాత్.

తా. బ్రహ్మదేవుని మొదలుకొని స్థావరముల వరకు గల సమస్త శరీరము లందు ఏకమగు ఏ చైతన్యము గలదో ఆ చైతన్యమే నేను - అను దృఢజ్ఞానము కలుగవలెను.

వ్యాఖ్యానము - మహావాక్యములలోని మొదటిదగు ప్రజ్ఞానం బ్రహ్మ - అను వాక్యము యొక్క అర్థము ఇచట నిరూపింపబడినది. కుండలు అనేకములు యున్నప్పటికిని ఆకాశము ఒక్కటే అయినట్లు ఈ సృష్టిలో 84 లక్షల రకముల జీవరాసు లున్నప్పటికిని వాటియందలి చైతన్య మొకటియే. ఆ చైతన్యమే ఆత్మ. ఆ ఆత్మయే తానను దృఢజ్ఞానము మనుజునకు కలుగ వలెను. అట్లు కలుగుటకు ప్రతిదినము ఆత్మానుసంధాన మొనర్చు చుండవలెను. శివోఽహం శివోఽహం అని ఎలుగెత్తి పాడుచుండవలెను. తాను ఆత్మయను భావమును ఏ క్షణ మందును మరువరాదు. సమస్త ప్రాణులందును గల ఆత్మ తానని తలచినపుడు ఇక జీవరాసులపై ప్రేమ, దయ, కరుణ కలుగుచుండును.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

**60. నిరంతరాత్మాను సంధాన వశాన్మమనసో వృత్తిరూప పరిణామ పరిత్యాగేన నిరుద్ధతాకారేణ ఆత్మ పరిణామో దృఢీ భూయాత్.**

తా. నిరంతరము ఆత్మానుసంధానము గావించుచు మనస్సును అధిష్ఠానమగు ఆత్మయందు లయింప జేయవలెను.

వ్యాఖ్యానము - పెక్కు జన్మలనుండి మానవునిలో అజ్ఞానము దృఢపడి యున్నందున ఆత్మచింతన నిరంతరము చేయవలెనని ఇచట చెప్పబడినది. దృఢపడియున్న అజ్ఞానము, అవిద్య ఒకరాగాన నశింపవు, కావున ఏదియో కొద్దిసేపు ఆత్మ చింతన చేయుట చాలదు. మనస్సు నందు రజోగుణ, తమోగుణములు తొలగి విశుద్ధ సత్త్వగుణము ఏర్పడవలెను. ఉప్పుకల్లు నీటిలో లయించు లాగున విశుద్ధ సత్త్వ గుణముతో కూడిన మనస్సు అధిష్ఠానమగు ఆత్మయందు లయించును. అపుడు జీవునకు కలుగు ఆనందము వర్ణనాతీతము. అట్టి స్థితిని నిరంతర ఆత్మానుసంధానము ద్వారా జీవుడు పొంది ఈ జీవితమందే ఆత్మ సాక్షాత్కరమును బడయవలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

61. జాగ్రత్ప్రత్యుద్భూత బాహ్యేంద్రియ విషయ
సముల్లాససాక్షీ శివోఽహం
స్వప్నే దృష్టప్రపంచ ప్రతిఫలన మనో వృత్తి
సాక్షీ శివోఽహమ్
సుప్తే చిత్తే ప్రలీనే ప్రబల తమ మహామోహ
సాక్షీ శివోఽహం
నిత్యానందే తురీయే విగత కలిమల స్సర్వసాక్షీ
శివోఽహమ్.

తా. 1) జాగ్రత్తునందు ఇంద్రియములచే ఏర్పడిన దృశ్యప్రపంచమునకు సాక్షియైనట్టి శివరూప ఆత్మను నేను. 2) స్వప్నమందు మనోవృత్తి ప్రతిబింబము వలన ఏర్పడిన కల్పిత జగత్తుకు సాక్షియైనట్టి శివరూపాత్మను నేను 3) సుషుప్తి యందు చిత్తము విలీనముకాగా ఏర్పడు ప్రబలతమస్సుకు సాక్షియైనట్టి శివరూపాత్మను నేను 4) తురీయమందు సమస్తమునకు సాక్షియైనట్టి శివరూపాత్మను నేను.

వ్యాఖ్యానము – జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, తురీయము – అను నాల్గు అవస్థలకు ఆత్మ సాక్షిగ యుండును. ఆయా అవస్థల యందు జరుగు కార్యకలాపములతో ఆత్మకు ఏ సంబంధమున్ను లేదు. ఆత్మ నిర్వికారి. అది ఎల్లపుడు నిస్సంగముగ యుండును. నిరంతర సాధనచే జీవుడు అట్టి ఆత్మస్థితి పొందగలును.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

62. ఆత్మానం చేద్విజానీయాత్ అయమస్మీతి పూరుషః
కిమిచ్ఛన్కస్యకామాయ శరీరమనుసంజ్వరేత్.

తా. తనను ఆత్మగ తెలుసుకొనినవాడు ఏ కోరిక నిమిత్తము దేహమును బాధపెట్టును?

వ్యాఖ్యానము - ఆత్మానుభూతి కలిగినవానికి ఇక ఏ కోరికయు యుండదు. అన్ని నదులు సముద్రమును చేరునట్లు అన్ని కోరికలచే కలుగు ఆనందము బ్రహ్మానందమున మిళితమై యుండును. అది అనుభవించువారికి ఇక విషయానందముతో నిమిత్తము లేదు. కనుక అట్టి మహోన్నతమైన ఆనందమును పొందుచు జీవితమందు ఏ కోరికయు లేక పరమ శాంతితో కాలము గడుపవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

63. బ్రహ్మానందనిధి ర్మహాబలవతాహంకార ఘోరాహినా
సంవేష్ట్యాత్మని రక్ష్యతే గుణమయైః చండై స్త్రిభిర్మస్తకైః
విజ్ఞానాత్మ మహాసినా ద్యుతిమతా విచ్ఛిద్య శీర్షత్రయం
నిర్మూల్యాహి మిమం నిధిం సుఖకరం
ధీరోఽను భోక్తుం క్షమః.

తా. బ్రహ్మానందమను నిధి మహాశక్తివంతమైన అహంకారమను సర్పముచే రక్షింపబడుచుండును. త్రిగుణములే ఆ సర్పము యొక్క మూడు తలలు. విజ్ఞానమను గొప్ప ఖడ్గముచే దాని మూడు తలలను ఛేదించి వైచి ఈ ప్రకారముగ అహంకారమును నిర్మూలించి ధీరుడు మాత్రమే ఆ నిధిని అనుభవించును.

వ్యాఖ్యానము – పూర్వకాలము ధనమును ఆభరణములను ఒక బిందెలో వేసి భూమిలో ఎచటనో పాతిపెట్టుదురు. ఆ నిధిని సర్పము కావలి కాచుచుండును. బ్రహ్మానందమను నిధిని అహంకారమను సర్పము సంరక్షించుచుండును. విజ్ఞానమను ఖడ్గముచే ఆ అహంకారమను సర్పమును తొలగించి బ్రహ్మానందమను నిధిని అనుభవించుచు సుఖముగ యుండవలెను. ధీరుడే అట్టి కార్యమునకు సమర్థుడు.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

64. దేహేఽస్థిమాంసరుధిరేఽభిమతం త్యజ త్వం
జాయా సుతాదిషు సదా మమతాం విముచ్య
పశ్యానిశం జగదిదం క్షణభంగనిష్ఠం
వైరాగ్య రాగరసికో భవ భక్తినిష్ఠః.

తా. రక్తమాంసములతో కూడిన దేహము యెడల అభిమానమును వీడుము. భార్యాపుత్రాదుల యెడల మమత్వమును వదలుము. ఈ జగత్తు క్షణభంగురమని ఎరిగి వైరాగ్యము కలిగి దానియెడల వ్యామోహమును వీడుము. ఆత్మ యెడల భక్తి కలిగియుండుము.

వ్యాఖ్యానము - దృక్, దృశ్యము అను రెండు వస్తువులు గలవు. దృక్కు ఆత్మ. దృశ్యము మూడు విధములుగ యుండును. శరీరము, బంధ్వాదులు, నామరూపాత్మక జగత్తు. దృశ్యము క్షణభంగురమైనది. కొద్ది కాలములో కాలగర్భమున విలీనమై పోవునది. కాబట్టి దానిని నమ్ముకొనరాదు. స్థిరమై శాశ్వతమైనట్టి ఆత్మనే ఆశ్రయించ వలెను. భక్తి జ్ఞానవైరాగ్యాదుల సాధన ద్వారా హృదయస్థ ఆత్మను పొంది జీవుడు పరమ శాంతిని అనుభవించవలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

65. బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః
జీవన్ముక్తస్తు తద్విద్వాన్ ఇతి వేదాంతడిండిమః.

తా. బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య (కల్పితము), జీవుడు బ్రహ్మమే కాని మరొకడుకాడు. ఈ సత్యమును తెలిసినవాడు జీవన్ముక్తుడే యగును - అని వేదాంత భేరి మ్రోగుచున్నది.

వ్యాఖ్యానము - వేదాంత సారమంతయు ఇచట తెలుపబడినది. బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య, జీవుడు బ్రహ్మము కంటె వేరుకాదు. ఈ మూడింటిని తెలుసుకొన్నవాడు జీవన్ముక్తుడు. అజ్ఞానులు ఈ రహస్యమును తెలుసుకొనక జగత్తును సత్యముగ భావించుచు తనను దేహముగ తలంచుచు సంసార చక్రములో పడి తిరుగాడు చున్నారు. వేదాంతభేరి ఏ విధముగ పలుకుచున్నదో చక్కగ తెలుసుకొని ఆచరించవలెను, ఆచరించి తరించవలెను. త్రికాలము లందును యుండునదే సత్యము. జగత్తు అట్లు లేదు. ప్రళయకాలమున అది నశించిపోవును. కాబట్టి దానిని నమ్ము కొనినచో శాంతిగాని, సుఖముగాని కలుగనేరవు. బ్రహ్మమే తానని తెలుసుకొని నిరంతరము ఆ బ్రాహ్మీ స్థితిలోనే యుండవలెను. అపుడే జీవన్ముక్తత్వము సిద్ధించును. కాబట్టి సత్యమైన సిద్ధాంత మును సాధకుడు నిరంతరము చింతన చేయవలెను.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

66. అహో౽స్మాకమలం మోహై రాత్మా బ్రహ్మేతి నిశ్చయం
శ్రుతి భేరీ రవో౽ద్యాపి శ్రూయతే శ్రుతిరంజనః.

తా. అహా! మా అవిద్య నశించినది. ఆత్మ బ్రహ్మమని వేదాంతభేరి శ్రవణరంజకముగ ఇప్పటికిని పలుకు చున్నది. మాకు నిర్భయత్వము కలిగినది.

వ్యాఖ్యానము - శ్రీ శంకారచార్యులవారు వేదాంత డిండిమము అను శ్లోకములందు ఇట్లు తెలిపిరి - ఆత్మ బ్రహ్మమే అని ఎరిగినందున మనుజునకు ఎక్కడలేని ఆనందము, ధైర్యము, నిర్భయత్వము కలుగును. శ్రవణానందకరమైన ఈ సత్యమును వేదాంతభేరి ఇప్పటికిని పలుకుచున్నది. కనుక ఇక ఎవరును దిగులునొంద వలసిన పనిలేదు. అందరును బ్రహ్మ స్వరూపులే. ఇట్టి సత్యము లను తెలుసుకొనినందున జీవునకు ఎక్కడలేని ధైర్యము, ఆనందము కలుగును. కాబట్టి - అహం బ్రహ్మో౽స్మి - నేను బ్రహ్మమును - అను మహా వాక్యమును నిరంతరము మననము చేయు చుండవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సో౽హం, సో౽హం, శివో౽హం, శివో౽హం - చిదానందరూప శ్శివో౽హం శివో౽హం.

67. క్రియాంతరాసక్తి మపాస్య కీటకో
ధ్యాయన్యథాలిం హ్యలిభావ మృచ్ఛతి
తథైవ యోగీ పరమాత్మ తత్త్వం
ధ్యాత్వా సమాయాతి తదేక నిష్ఠయా.

తా. ఇతర పనుల యెడల ఆసక్తిని వీడి పురుగు తుమ్మెదనే చింతించుటచే తుమ్మెదగనే మారిపోవుచున్నది. అట్లే యోగి ఏకాగ్రచిత్తముతో, తదేక నిష్ఠతో బ్రహ్మచింతన చేయుట చేత సాక్షాత్ బ్రహ్మమే యగుచున్నాడు.

వ్యాఖ్యానము – యద్భావం తద్భవతి – అని దేనిని చింతించుచున్నాడో అది యగుచున్నాడు – అని సంస్కృతములో ఒక వాక్యము గలదు. పురుగు తుమ్మెదయగుటయే ఇందులకు దృష్టాంతము. తుమ్మెద పురుగును గూటిలో పెట్టి ఎచటికో పోవును. తుమ్మెద వచ్చి తనను చంపునేమో యని పురుగు నిరంతరము భయపడుచు తుమ్మెదనే చింతించుచుండను. అపుడు పురుగు తుమ్మెదగ మారిపోవును. ఇక మానవుని విషయమై వేరుగ చెప్పనేల ? బ్రహ్మచింతనచే మానవుడు తప్పక బ్రహ్మముగ యగును.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శివోఽహం శివోఽహం.

68. నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానాం
ఏకో బహూనాం యో విదధాతి కామాన్
తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాః
తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషామ్.

తా. నిత్యమైన వాటిలో నిత్యమును, చేతనమైన వాటిలో చేతనమును, అనేకమైన వాటిలో ఏకమును, భక్తుల అభీష్టమును నెరవేర్చునదియు అగు ఆత్మను తమయందు ఎవరు సాక్షాత్కరించు కొందురో అట్టి ధీరులకు శాశ్వతమైన శాంతి కలుగును.

వ్యాఖ్యానము - శాంతికొరకై అనేకులు అన్వేషించు చుందురు. కొందరికి శాంతి కలిగినను అది తాత్కాలికముగనే యుండును. ఆత్మ సాక్షాత్కారమును పొందినవారికి పరిపూర్ణ శాంతి సుఖములు కలుగును. కాబట్టి అక్కార్యము కొరకై నిరంతరము ప్రయత్నము చేయవలెను. ప్రాపంచిక విషయముల యెడల విరక్తి కలిగి, ఆత్మ విచారణ సలిపి బ్రహ్మజ్ఞానమును సంపాదింప వలెను. వేదాంత మును బోధించిన తత్త్వమును, తత్త్వమసి మున్నగు మహా వాక్యముల అర్థమును చక్కగ మననము చేసి స్వస్వరూపానుభూతిని బడయవలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

69. నేతి నేతీతి వాక్యేన శేషితం యత్పరంపదమ్
పరిత్యక్తు మశక్తత్వా త్తదస్మీతి సుఖీభవ.

తా. ఇదికాదు, ఇది కాదు - మున్నగు వాక్యములద్వారా వస్తువులన్నిటిని తొలగించి వేసినచో తొలగించుటకు వీలుకాని ఏ పరమాత్మ వస్తువు శేషించునో అదియే నీవని భావించి సుఖముగ యుండుము.

వ్యాఖ్యానము - ఆత్మ నెరుగుట ఎట్లో ఇట సులభోపాయము తెలుపబడినది. ఆత్మ కానట్టి వస్తువులన్నిటిని 'ఇదికాదు, ఇదికాదు' అని తొలగించి వేసినచో తుదకు ఆత్మ మిగులును. అపుడు అదియే తానని భావించి సుఖముగ యుండవలెను. ప్రప్రథమమున అనాత్మ వస్తువులన్నిటిని తొలగించి వేయవలెను. శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, చిదాభాసుడు, పంచమహాభూతములు ఇవన్నియు అనాత్మ స్వరూపములు. వీటికి సాక్షిగ యున్న ఆత్మయే తాను అవియే తనయొక్క నిజస్వరూపము. కాని జడమైన పైన తెలిపిన వస్తువులు కాదు. ఇట్లు ఆత్మ విచారణ చేసి క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగము గావించవలెను. భగవద్గీత 13వ అధ్యాయములో ఈ విషయమును గూర్చి విపులముగ చెప్పబడినది.

ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

70. విలక్షణం యథా ధ్వాంతం లీయతే భానుతేజసి
తథైవ సకలం దృశ్యం బ్రహ్మణి ప్రవిలీయతే.

తా. ప్రకాశమునకు విలక్షణమైనట్టి చీకటి సూర్యప్రకాశమందు విలీన మగును. అట్లే సమస్త దృశ్యము బ్రహ్మమునందు విలీనమై పోవును.

వ్యాఖ్యానము – ఎన్ని వస్తువులను తెచ్చినను చీకటి తొలగదు. ఒక్క అగ్గిపుల్ల వెలిగించినపుడు మాత్రమే చీకటి ఆ ప్రకాశములో లయమగును. అట్లే ఈ దృశ్యమంతయు ఒక్క బ్రహ్మమునందే విలీనమగును. ఈ దృశ్యమునంతను ఆత్మలో లయమొనర్చి ఆత్మ రూపుడుగనే శేషించుటను అభ్యసించవలెను. అదియే సమాధిస్థితి. యమనియమాది అష్టాంగములలో మొదటి ఏడింటిని చక్కగ అభ్యసించినచో చివరిదగు సమాధిస్థితి యందు నిలకడను సంపాదింపవచ్చును. అగ్గిపుల్ల వెలిగించినచో చీకటి పటాపంచలై పోవును. అది ఎక్కడకు పోయినదో ఎవరికి తెలియదు. అట్లే ఈ దృశ్యమున్ను ఎంతయో స్థూలముగ కనుపించు చున్నప్పటికిని ఆత్మయందు విలయమై అదృశ్యమై పోవును. అట్టి ఆత్మస్థితిని చక్కగ అభ్యసింపవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

71. రవేర్యథా కర్మణి సాక్షిభావో
వహ్నేర్యథా వాఽయసి దాహకత్వమ్
రజ్జోర్యథా ఽఽరోపిత వస్తుసంగ
స్తథైవ కూటస్థ చిదాత్మనో మే.

తా. ప్రపంచమందు చేయబడు సమస్త కర్మలకు సూర్యుడు సాక్షిగ యుండును. ఇనుప గుండు చిన్నదైనను, పెద్దదైనను అగ్నికి దానితో ఏ సంబంధము లేదు. ఆరోపింపబడిన త్రాటితో సర్పము నకు ఏలాటి సంబంధము లేదు. అట్లే కూటస్థమగు ఆత్మతో ఈ జగత్తుకు ఎట్టి సంబంధము లేదు. అట్టి ఆత్మయే నేను.

వ్యాఖ్యానము – ప్రపంచములో ఎన్నియో కార్యకలాపములు జరుగు చున్నను సూర్యుడు వాటినన్నిటిని సాక్షిగ గాంచుచున్నాడు. ఆ పనులతో సూర్యునకు ఎట్టి సంబంధము లేదు. అట్లే ఇనుప గుండు యొక్క ఆకారముతో అగ్నికి ఎట్టి సంబంధము లేదు. సర్పము రజ్జువుపై ఆరోపింపబడినదే గాని అది సత్యము కాదు. అట్లే కూటస్థుడైన చిదాత్మపైన ఈ జగత్తు కల్పింపబడినది. ప్రపంచము సత్యముకాదు. కూడస్థుడగు ఆత్మయే సత్యము. కూటమనగా స్వర్ణకారుని దాగిలి. అభరణములు మారునేకాని కూటమగు దాగిలి మారదు. అట్లే ఆత్మయున్ను బ్రహ్మయున్ను అట్టి నిర్వికార ఆత్మయే నేను.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

72. సర్వాధారం సర్వవస్తుప్రకాశం
సర్వాకారం సర్వగం సర్వశూన్యమ్
నిత్యం శుద్ధం నిశ్చలం నిర్వికల్పం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహమస్మి.

తా. సర్వమునకు ఆధారము, సర్వవస్తువులను ప్రకాశింప జేయునది, సర్వాకారము, అంతటను వ్యాపించియున్నదియు వస్తుశూన్యము, నిత్యము, శుద్ధము, నిశ్చలము, నిర్వికల్పము అగు ఏ అద్వైత బ్రహ్మము గలదో అదియే నేను.

వ్యాఖ్యానము - బ్రహ్మము యొక్క స్వరూపము ఇచట స్పష్టముగ తెలుపబడినది. కోఽహం (నేనెవడను ?) అను ప్రశ్నతో వేదాంతము ఆరంభమగును. సోఽహం (ఆ బ్రహ్మమే నేను) అను జవాబుతో ఆత్మవిచారణ పూర్తియగును. బ్రహ్మము శూన్యము కాదు. అది చైతన్యము. అది ఆకాశము కాదు, చిదాకాశము. కొందరు శూన్యవాదులు ఆత్మను శూన్యముగ చెప్పుదురు. అది సరికాదు. శూన్యమునకు సాక్షియే ఆత్మ. దృశ్యవస్తువులన్నిటిని తొలగించి నపుడు సచ్చిదానందమగు ఆత్మ మాత్రము శేషించును. అదియే తాను. అదియే తనయొక్క నిజస్వరూపము.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

73. ఉపాధిరాయాతి స ఏవ గచ్ఛతి
స ఏవ కర్మాణి కరోతి భుంక్తే
స ఏవ జీవన్మ్రియతే సదాఽహం
కులాద్రివన్నిశ్చల ఏవ సంస్థితః.

తా. శరీరము వచ్చుచున్నది, పోవుచున్నది. అదియే కర్మలను చేయుచున్నది, ఫలములను పొందుచున్నది. అదియే జీవించుచున్నది, మరల మరణించుచున్నది. కాని నేను (ఆత్మ) సదా కులపర్వతము వలె నిశ్చలముగ యున్నాను.

వ్యాఖ్యానము - ఎన్ని తుఫానులు వీచినను, జలతరంగములు ఎన్ని స్పృశించినను పర్వతము నిశ్చలముగనే యుండును. ఏ మాత్రము చలింపదు. అట్లే ఉపాధులు (శరీరములు) ఎన్ని వచ్చినను, పోయినను ఆత్మ నిశ్చలముగనే యుండును. ఈ ప్రకారముగ ఆత్మస్థితిని గూర్చి చక్కగ చింతన చేయుచు, ప్రకృతి ఎంత చలించినను తాను నిశ్చలముగనే యుండవలెను. సంసారమున ఉపాధికి శీతోష్ణములు, సుఖదుఃఖములు మున్నగునవి ఎన్నియో కలుగు చుండును. కాని వాటిచే తానేమాత్రము చలింపరాదు. స్థిత ప్రజ్ఞుడై యుండవలెను.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

74. మయ్యఖండ సుఖాంభోధౌ బహుధా విశ్వవీచయః
ఉత్పద్యన్తే విలీయన్తే మాయామారుత విభ్రమాత్.

తా. అఖండ సుఖసాగరమగు నా యందు మాయ అను గాలి వలన జగత్తులను తరంగములు పుట్టుచుండును, విలీనమగుచుండును.

వ్యాఖ్యానము – ఆత్మ ఎంత గంభీరమైనదో ఇచట స్పష్టముగ తెలుపబడినది. మానవుడు అల్పుడు కాదు. తన వాస్తవ స్వరూపమగు ఆత్మలో ఎన్నియో జగత్తులు ఉత్పన్నమగు చున్నవి, విలీనమగు చున్నవి. వాస్తవ పరిస్థితి ఇట్లుండ తాను అల్పుడను, చిన్నశరీరము గలవాడను – అని తలంచుట; పరిస్థితులను చూచి భీతిల్లుట కేవలము హాస్యాస్పదము. తాను జడ వస్తువు కాదు, చైతన్యమగు ఆత్మ అని నిరంతరము మననము చేయుచు గంభీరముగ యుండవలెను. సోఽహం, శివోఽహం అని ఎల్లపుడు స్మరించవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

75. వేదాంత సిద్ధాంత నిరుక్తి రేషా
బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ
అఖండ రూపస్థితిరేవ మోక్షో
బ్రహ్మాద్వితీయే శ్రుతయః ప్రమాణమ్.

తా. బ్రహ్మమే జీవుడు, బ్రహ్మమే సమస్త జగత్తు - ఇదియే వేదాంతము యొక్క సారము. అఖండమగు ఆత్మస్థితియే, బ్రహ్మ స్థితియే మోక్షము. ఇందులకు శ్రుతియే ప్రమాణము.

వ్యాఖ్యానము - బ్రహ్మమునందు, ఆత్మయందు ఈ జగత్తులన్నియు కల్పింప బడియున్నవి. కాబట్టి జీవుడు, సమస్త జగత్తులు కేవలము బ్రహ్మ స్వరూపములే అయియున్నవి. మోక్షమనగా ఒకానొక వస్తువనియు, అది ఆకాశముననో, పాతాళముననో ఉన్నదని తలంపరాదు. అఖండమగు ఆత్మయందు నిలకడ కలిగి యుండుటయే మోక్షము. మనస్సును జయించి అధిష్ఠానమగు ఆత్మయందు లయింప జేయుటయే మోక్షము. మనస్సును, ఇంద్రియములను ప్రయత్నముతో జయించి ఆత్మయందు స్థితి కలిగియుండుటను నిరంతరము అభ్యసించవలెను.

అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

76. స్వానుభూత్యా స్వయం జ్ఞాత్వా స్వమాత్మానమఖండితమ్
సంసిద్ధః సుసుఖం తిష్ఠే న్నిర్వికల్పాత్మనాత్మని.

తా. స్వానుభవము చేత అఖండమగు ఆత్మను స్వయముగ తెలుసుకొని నిర్వికల్పమగు ఆత్మయందు సుఖముగ యుండవలెను.

వ్యాఖ్యానము – ఆత్మ ఎచటనో దూరముగ లేదు. తన హృదయమందే యున్నది. ఆత్మను గూర్చి పుస్తకముల ద్వారా తెలుసుకొనుట చాలదు. అనుభవము ద్వారా తెలుసుకొని, అద్దాని యందు స్థితుడై పరమానంద మనుభవించవలెను. చక్కెర ఇట్లున్నది అని తెలుసుకొనిన చాలదు, దానిని తిని మాధుర్యమును అనుభవించ వలెను. ప్రపంచమున ఎన్ని కల్లోలములు యున్నప్పటికిని ఆత్మ జ్ఞాని నిశ్చలుడై పరమాశాంతుడై యుండును. సాధకుడు గురు బోధను చక్కగ ఆలకించి ప్రయత్న పూర్వకముగ ఆత్మానుభూతిని సంపాదించి జీవితమును పరమశాంతముగ, ఆనందముగ గడుపవలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

77. నిర్గుణం నిష్కలం సూక్ష్మం నిర్వికల్పం నిరంజనమ్
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహనానాస్తి కించన.

తా. నిర్గుణమై, నిష్కలమై, సూక్ష్మమై, నిర్వికల్పమై, నిరంజనమై, ఏకమై, అద్వయమైనట్టి బ్రహ్మ మొకటియే ఇచట గలదు గాని, అనేకము ఏ మాత్రమున్ను లేదు.

వ్యాఖ్యానము - కుండలు అనేకము యున్నప్పటికి ఆకాశము ఒకటిగనే యుండును. అట్లే ప్రపంచములో అనేక పదార్థము లున్నప్పటికిని చిదాకాశమగు ఆత్మ ఒకటియే. అందరిలోను, అన్ని పదార్థము లలోను ఆత్మ, బ్రహ్మము ఒక్కటియే. ఈ భావము రూఢిపడినచో ఇక వైరమనునది కలుగనే కలుగదు. ఒకరినొకరు కొట్టుకొనుటగాని, తిట్టుకొనుటగాని, హింసించుకొనుటగాని సంభవింపదు. నిర్వైరస్సర్వ భూతేషు - అని భగవద్గీతలో చెప్పిన స్థితి సంభవించును. ఒక అద్దముల గదిలోనికి కుక్క ప్రవేశించినచో అద్దములోని కుక్క పైకి ఎగిరిపడును, కాని మనుష్యుడు అట్లు చేయడు. ఏకత్వమును చక్కగ అలవరచుకొని ప్రేమ, దయ, కరుణ మున్నగువానిని కలిగి యుండవలెను. అపుడే శాంతి చేకూరును.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సో஽హం, సో஽హం, శివో஽హం, శివో஽హం -
చిదానందరూప శ్శివో஽హం శివో஽హం.

78. అహం బ్రహ్మేతి విజ్ఞానాత్ కల్పకోటి శతార్జితమ్
సంచితం విలయం యాతి ప్రబోధాత్ స్వప్నకర్మవత్.

తా. ''నేను బ్రహ్మమును'' అను విజ్ఞానముచే కోట్లకొలది జన్మలందు ఆర్జించిన సంచిత కర్మయంతయు - మేలుకొనినచో స్వప్నమందలి కర్మ వలె - విలయమై పోవును.

వ్యాఖ్యానము - అహంబ్రహ్మాస్మి - అను మహావాక్యమునకు ఎంతటి గొప్పవిలువగలదో ఇచట సూచింపబడినది. నేను బ్రహ్మమును - అను విజ్ఞానమును చక్కగ జీర్ణింప జేసుకొనినచో అనేక జన్మలందు ఆర్జింపబడిన సంచిత కర్మయంతయు నశించిపోవును. స్వప్నములో ఎంత కర్మ చేసినను మేలుకొనినచో అదియంతయు నశించి పోవునుగదా! అట్లే మహా వాక్యము యొక్క అనుభూతిచే బహు జన్మార్జిత కర్మయంతయు భస్మమై పోవును. కర్మ లేనిచో జన్మ యుండదు. కనుక జన్మరాహిత్యము సిద్ధించునని భావము.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

79. అఖండానంద మాత్మానం విజ్ఞాయ స్వస్వరూపతః
కిమచ్ఛన్కస్య వా హేతోర్దేహం పుష్ణాతి తత్త్వవిత్.

తా. తన స్వరూపము అఖండానందమని తెలుసుకొనువాడు ఇక ఏ హేతువు చేత, ఏ భోగభాగ్యముల చేత దేహమును పరిపుష్టి నొందించుకొనును ?!

వ్యాఖ్యానము - ప్రతిజీవియు ఆనందము కొరకు అన్వేషించును. ఏదైన ఒక వస్తువును అనుభవించి ఆనందమును పొందుచుండును. అవియన్నియు అల్పానందములు, తన స్వరూపమే ఆనందమని తెలుసుకొనినపుడు, తాను ఆనందసాగరమని గ్రహించినపుడు ఇక అల్పసుఖములతో పని ఏమి? కావున తన యొక్క నిజస్వరూపమును బాగుగ తెలుసుకొనవలెను. ఇట్లు శాస్త్రముల వలన, గురబోధ వలన తనయొక్క నిజస్వరూపము అఖండానందమని తెలుసుకొని ఇక జీవితమును అల్పానందముల అన్వేషణకొర్రకై వ్యర్థపరుపరాదు. కాలము చాల మూల్యము. జీవితమందలి ప్రతిక్షణము విలువైనది.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

80\. ప్రారబ్ధసూత్ర గ్రథితం శరీరం
ప్రయాతు వా తిష్ఠతు గోరివ స్రక్
న తత్పునః పశ్యతి తత్త్వవేత్తా
నందాత్మని బ్రహ్మణి లీనవృత్తిః.

తా. ప్రారబ్ధమను త్రాడు చేత కట్టబడిన ఈ శరీరము యుండుగాక, పోవుగాక! ఆవు మెడలో వేసిన పూలమాలవలె జ్ఞాని దానిని గూర్చి పట్టించుకొనడు. బ్రహ్మమందు లీనమైన మనోవృత్తి గలవాడై అతడు పరమానందమున నిమగ్నుడై యుండును.

వ్యాఖ్యానము – "ఈ శరీరము ప్రారబ్ధమను త్రాటి చేత కట్టబడి యున్నది. అది ఎటులాగిన అటుపోవును. పోవుగాక! నేను ఆ శరీరము కంటె వేరుగ యున్నాను." – అని ఆత్మ జ్ఞాని తలంచును. మనుజుని మెడలో పూలమాల వేసినచో అది గౌరవమని అతడు తలంచును గాని, ఆవు మెడలో పూలదండ వేసినచో అది తనకు గౌరవమని గాని, అగౌరవమనిగాని తలంపదు. నిర్లక్ష్యముగ యుండును. జ్ఞాని బ్రహ్మానందములో నిమగ్నుడై యుండును. కనుక దేహవిషయమై అతడేమియు పట్టించుకొనడు. ఈ ప్రకారము బ్రహ్మమునందు నిమగ్నుడై యుండుటను చక్కగ అభ్యసింపవలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

81. సతత విమల బోధానందరూపం సమేత్య
త్యజ జడమలరూపోపాధిమేతం సుదూరే
అథ పునరపి నైవస్మర్యతాం వాన్తవస్తు
స్మరణ విషయభూతం కల్పతే కుత్సనాయ.

తా. నిర్మలమై, చైతన్యరూపమై, ఆనంద స్వరూపమైనట్టి ఆత్మను నిరంతరము ఆశ్రయించి జడమై అపవిత్రమైనట్టి ఉపాధిని (శరీరమును) సుదూరముగ త్యజించుము (అభిమానమును వీడుము). కక్కిన వస్తువును వలె మరల అద్దానిని స్మరింపవలదు.

వ్యాఖ్యానము – నిత్యమై, శుద్ధమై, బుద్ధమైనట్టి ఆత్మను, బ్రహ్మమును నిరంతరము ఆశ్రయించి ఉపాధి యెడల అభిమానమును వదలివేయుము. – ఇదియే వేదాంతము యొక్క సారము. ఉదయము లేచినది మొదలు మరల పరుండవరకును మానవుడు దేహమే తానని భ్రమించుచున్నాడు. జడమై మలమూత్రాదులతో కూడియున్నట్టి అపవిత్రమైన శరీరము తానెట్లగును? చైతన్య వంతమగు ఆత్మయే తాను ఇట్టి భావములను నిరంతరము మననము చేయుచుండవలెను. దేహముపై వ్యామోహము వదల వలెను.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

82. అతీవ సూక్ష్మం పరమాత్మ తత్త్వం
న స్థూలదృష్ట్యా ప్రతిపత్తు మర్హతి
సమాధినాఽ త్యన్త సుసూక్ష్మవృత్త్యా
జ్ఞాతవ్యమార్యై రతిశుద్ధ బుద్ధిభిః

తా. ఆత్మ మహాసూక్ష్మము. అది స్థూలబుద్ధిచేత తెలుసుకొనుటకు వీలుపడదు. బుద్ధి శుద్ధముగను, ఏకాగ్రముగను యుండవలెను. అపుడే ఆత్మ సాక్షాత్కరింప బడగలదు.

వ్యాఖ్యానము – స్థూల బుద్ధిచేత, అపవిత్రమగు బుద్ధి చేత, చంచలబుద్ధి చేత ఆత్మను ఎవరును తెలుసుకొనజాలరు. ఒక పాత్రలోని నీటి అడుగున గల వస్తువు కనుపించుటకు నీరు నిర్మలముగ యుండవలెను. నీరు కదలరాదు. నీటిపై మూత యుండరాదు. అట్లే ఆత్మ సాక్షాత్కరించుటకు మనస్సుకు ఆవరణ విక్షేపము, అపవిత్రత యుండరాదు. కాబట్టి సాధనల ద్వారా, భక్తి జ్ఞాన వైరాగ్యముల ద్వారా మనస్సును నిర్మలముగను, నిశ్చలముగను, నిరావరణముగను యుంచుకొనినచో తుడిచివేసిన అద్దములో ముఖము చక్కగ గోచరించునట్లు ఆత్మానుభూతి చక్కగ కలుగును. అపుడే జన్మ సార్థకమగును.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

83. శ్రుతిస్మృతి న్యాయశతైర్నిషిద్ధే
దృశ్యేఽత్ర యః స్వాత్మమతిం కరోతి
ఉపైతి దుఃఖోపరి దుఃఖజాతం
నిషిద్ధ కర్తా స మలిమ్లుచో యథా.

తా. పెక్కు శ్రుతి, స్మృతి, న్యాయములచే నిషిద్ధమగు దృశ్యమునందు (శరీరమునందు) 'నేను' అను భావముగలవాడు - నిషిద్ధ కార్యము చేయు దొంగవలె దుఃఖములను మరల మరల పొందుచుండును.

వ్యాఖ్యానము - శ్రుతులు, స్మృతులు, న్యాయములు మున్నగు శాస్త్రములు జీవుని యొక్క నిజస్వరూపమును గూర్చి చక్కగ బోధించుచున్నవి. "ఓ జీవుడా! నీవు జడమగు దేహము కాదు. ఉపాధికాదు, దృశ్యము కాదు. నీవు బోధస్వరూపమగు చిన్మయ ఆత్మవు. జననమరణములకు అతీతమైన ఆత్మయే నీవు - ఇట్లు బోధించుచున్నను అనాది అవిద్యచే జీవుడు తాను జడస్వరూపమే అని తలంచుచున్నాడు. ఇది నిషిద్ధ కార్యమును చేయుటయే యగును. నిషిద్ధ కార్యములను చేయు దొంగ ఎన్నియో దుఃఖములను పొందునట్లు ఇట్టి అజ్ఞానికూడ ఎన్నియో బాధలను పొందును. కనుక అట్లు చేయరాదు.

అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

84. యత్రైష జగదాభాసో దర్పణాన్తః పురం యథా
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా కృతకృత్యో భవిష్యసి.

తా. అద్దమునందు పట్టణము వలె ఏ బ్రహ్మము నందు ఈ జగత్తంతయు భాసించుచున్నదో, అట్టి బ్రహ్మమే తానని భావించు చున్నచో కృత్యకృత్యుడగుదువు.

వ్యాఖ్యానము - ఆధారమగు అద్దము యున్నచో దానియందు పట్టణము ప్రతిబింబించును. బ్రహ్మమే ఆధారము. దానియందు జగత్తంతయు గోచరించుచున్నది. ఆ బ్రహ్మయే తానని తలంచినచో అపుడు జీవుడు కృతకృత్యుడు కాగలడు. జీవుడు తాను సామాన్యుడు కాడని, బ్రహ్మాండమంతయు వ్యాపించిన చిన్మయ ఆత్మ స్వరూపుడని భావించుచు మహద్ధైర్యమును పొందవలెను. అల్పత్వ మును వీడవలెను. జగత్తంతటికి ఆధారమైన ఆత్మయే తానని అహర్నిశము భావించుచుండవలెను.

అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

85. ఘటాకాశం మహాకాశ ఇవాత్మానం పరాత్మని
విలాప్యాఖండ భావేన తూష్ణీంభవ సదా మునే.

తా. ఘటము (కుండ) విలయమైనపుడు ఘటాకాశము మహాకాశము నందు లీనమగునట్లు మనస్సును పరమాత్మయందులయమొనర్చి అఖండాత్మ స్వరూపమును పొంది తూష్ణీంభావముతో (మౌనముతో) యుండుము.

వ్యాఖ్యానము – మనస్సును పరమాత్మ యందు ఏకాగ్రపరచి తూష్ణీం భావముతో (మౌనముగ) యుండవలెను. అపుడు అఖండానంద మును జీవుడు అనుభవించును. తూష్ణీంభావమనగా ఊరక యుండుట కాదు. వాసనలు క్షయింపవలెను. అనేక జన్మార్జిత విషయ వికారములు, వాసనలు మనస్సు నందు యుండును కనుక వాటినన్నిటిని వివేకము యొక్క సహాయముచే దులిపివేసి తూష్ణీంభావముతో ఊరక యుండిన చాలును. సోమరికూడ ఊరక యుండును. అట్లు ఊరకయుండుట కాదు ఇట చెప్పినది. వాసనా క్షయ మొనర్చుకొని మనస్సులో ఏ వికారము లేక ఆత్మయందు స్థితి కలిగియుండుటయే. అట్టి స్థితియందు ఆత్మ ఒక్కటియే యుండుట చేత అఖండానందము జీవుడనుభవించును.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోऽహం, సోऽహం, । శివోऽహం, శివోऽహం –
చిదానందరూప శ్శివోऽహం శివోऽహం.

86. స్వప్రకాశమధిష్ఠానం స్వయం భూయ సదాత్మని
బ్రహ్మాండమపి పిండాండం త్యజ్యతాం మలభాండవత్.

తా. స్వప్రకాశమై, జగత్తుకు అధిష్ఠానమై యున్న ఆత్మయందు స్థితి కలిగి బ్రహ్మాండమును, పిండాండమును మలభాండమును వలె త్యజించుము. (అభిమానమును వీడుము).

వ్యాఖ్యానము - వ్యష్టి శరీరముగాని, సమష్టి జగత్తుగాని రెండును దృశ్యకోటిలో చేరినవే. దృశ్యమును త్యజించివైచి దృక్స్వరూపమైన ఆత్మయందు స్థితి కలిగియుండుటయే జీవుని యొక్క లక్ష్యము. కాబట్టి దేహముపైగాని, బ్రహ్మాండమంతటిపైగాని ఏ విధమైన అభిమానమును లేక మనస్సును కేవలము ఆత్మయందే లయ మొనర్పవలెను. మలభాండమును ఎట్లు త్యజించుదురో అట్లు పిండాండమగు దేహమును, బ్రహ్మాండమును త్యజించి వేయవలెను. వాటిపై అభిమానమును వీడవలెనని అర్థము. ఇట్టి ఆత్మ స్థితి యందు జీవుడు అపారమగు ఆనందమును అనుభవించును.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

87. నిద్రాయా లోకవార్తాయాః శబ్దాదేరపి విస్మృతేః
క్వచిన్నావసరం దత్వా చిన్తయాత్మాన మాత్మని.

తా. అధికనిద్రకుగాని, లోకవార్తలకుగాని, ఆత్మను విస్మరింపజేయు శబ్దములకుగాని ఏ విధమైన అవకాశమివ్వక ఆత్మయందే మనస్సును లగ్నము చేసియుంచవలెను.

వ్యాఖ్యానము - అవసరమైన నిద్రను మాత్రము గైకొని అధికనిద్రను త్యజించవలెను. దేహారోగ్యము కొరకు ఒకింత నిద్ర అవసరమే. అధికనిద్ర తమో గుణములో చేరినది. రజోగుణమునకు, తమోగుణమునకు ఏ మాత్రము తావీయరాదు.

లోకవార్తలవలన అమూల్యమైన కాలము వృథాగ గడచిపోవును. ఆత్మను విస్మరింప జేయు శబ్దములను వినరాదు. ఆధ్యాత్మిక ప్రసంగములందే కాలము గడుపవలెను. ఒక్క క్షణమును కూడ వృథా చేయరాదు. ఆధ్యాత్మిక వాతావరణములో కాలమును సద్వినియోగ పరచుచున్నచో జీవునకు వివేక వైరాగ్యములు అభివృద్ధి నొంది ఆత్మోన్ముఖత్వము కలుగును. అపుడు ఆత్మానుభూతి చక్కగ సిద్ధించును.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

88. బుద్ధౌ గుహాయాం సదసద్విలక్షణం
బ్రహ్మాస్తి సత్యం పరమద్వితీయమ్
తదాత్మనా యోఽత్ర వసేద్గుహాయాం
పునర్న తస్యాంగ గుహ ప్రవేశః.

తా. సదసద్విలక్షణమై, సత్యస్వరూపమై, పరమై, అద్వితీయమైనట్టి బ్రహ్మము బుద్ధి గుహ యందు గలదు. అట్టి బ్రహ్మమునందు మనస్సును ఏకాగ్రపరచి ఎవరు యుందురో అట్టివారికి తిరిగి శరీరమును గుహయందు ప్రవేశము కలుగదు (మరల జన్మింపరు).

వ్యాఖ్యానము - రెండు గుహలు కలవు - 1) బుద్ధి గుహ, 2) శరీరగుహ. బుద్ధి గుహయందు పరమాత్మ నివసించును. అట్టి అద్వితీయ పరమాత్మ (బ్రహ్మము) యందు ఎవరు చిత్తమును స్థాపించి ధ్యానించుదురో అట్టి వారికిక శరీర గుహయందు ప్రవేశము యుండదు. అనగా జన్మ రాహిత్యము సిద్ధించును. కాబట్టి బుద్ధి గుహ యందలి బ్రహ్మమును గూర్చిన ధ్యానమును లెస్సగ అభ్యసింపవలెను. మనస్సును ఇటునటు చలింప జేయరాదు.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

89. స్వాత్మన్యేవ సదా స్థిత్యా మనో నశ్యతి యోగినః
వాసనానాం క్షయశ్చాతః స్వాధ్యాసాపనయం కురు.

తా. నిరంతరము ఆత్మయందు స్థితులై యున్న యోగులకు మనస్సు నశించును. తత్ఫలితముగ వాసనాక్షయమగును. కనుక అనాత్మ యందు ఆత్మరూపాధ్యాసమును వీడవలెను.

వ్యాఖ్యానము - మనస్సు నందలి వికారములను, వాసనలను ప్రయత్న పూర్వకముగ తొలగించుచు, అధ్యాసమును పోగొట్టుచు శుద్ధమనస్సును నిరంతరము ఆత్మయందు స్థాపించినచో ఉప్పుకల్లు నీటియందు కరుగునట్లు మనస్సు ఆత్మయందు విలయమై పోవును. అపుడు అనంతమగు ఆనందమును జీవుడనుభవించును. కావున మనస్సును నిత్యము బ్రహ్మమునందు స్థిరమొనర్చవలెను. వాసనాక్షయముచే మనోనాశము, మనోనాశముచే బ్రహ్మానుభూతి జీవునకు కలుగను. తత్త్వజ్ఞానము యొక్క సహాయముచే మొదట వాసనా క్షయమును గావించుకొనవలెను. దానిచే మనోనాశము, అద్దానిచే బ్రహ్మానుభూతి వాటంతట అవియే కలుగును.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోऽహం, సోऽహం, శివోऽహం, శివోऽహం - చిదానందరూప శ్శివోऽహం శివోऽహం.

90. జాతి నీతి కులగోత్ర దూరగం
నామరూప గుణ దోషవర్జితమ్
దేశకాల విషయాతివర్తి య
ద్బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని.

తా. బ్రహ్మము జాతి, నీతి, కుల గోత్రములు లేనిది. నామరూప గుణదోష రహితమైనది. దేశకాలములకు అతీతమైనది. అట్టి బ్రహ్మమే నీవని నిత్యము చింతన చేయుచుండుము.

వ్యాఖ్యానము - నిరంతర ఆత్మానుసంధానము వలననే జీవునకు ఆత్మానుభూతి కలుగను. బ్రహ్మమనునది క్రొత్తగ ఒకచోట నుండి తెచ్చునది కాదు, తాను బ్రహ్మమే అయియున్నాడు. కనుక బ్రహ్మానుభూతి కలుగుటలో ప్రయాస ఏమియును లేదు. అది అత్యంత శుద్ధమైనది. అవిభక్తమైనది. జాతులు, కులములు మున్నగునేవియు దానిలో యుండవు. ఆకాశమువలె స్వచ్ఛమైనది. అట్టి నిర్మల బ్రహ్మమును గూర్చి సదాభావన చేయుచు అదియే తానని తలంచుచుండవలెను. అట్లు చేయుటచే బ్రహ్మానుభూతి త్వరలో కలుగును.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

91. యది సత్యం భవేద్విశ్వం సుషుప్తావుపలభ్యతామ్
తన్నోపలభ్యతే కించి దతో సత్స్వప్నవన్మృషా.

తా. ఈ జగత్తు సత్యమైనచో సుషుప్తి యందు అది గోచరింప వలెను. అట్లు లేదు. కనుక అది స్వప్నమువలె లేనిదే యగును.

వ్యాఖ్యానము – ఒక వస్తువు సత్యమైనచో అది ఎల్లకాలములందును యుండవలెను. జాగ్రత్స్వప్నసుషుప్తులు మూడిటియందును గోచరింపవలెను. అట్లు గోచరింపనిచో అది లేనిదే యగును. లేని జగత్తును గూర్చి ఇక ఆశలు పెట్టు కొనుట, వ్యామోహము కలిగియుండుట తగదు. మూడు కాలములందును యుండునట్టి సర్వసాక్షియగు ఆత్మయందే మనస్సును నెలికొల్పియుండుట శ్రేయస్కరము. మిథ్యారూప ఈ జగత్తులో గల భోగభాగ్యములందు, విషయవిలాసము లందు మనస్సును పోనివ్వక ఆత్మయందే స్థాపించవలెను. అట్లు చేయుటచే బ్రహ్మానంద సముద్రము జీవుని అనుభవమునకు వచ్చును, పరమ శాంతి కలుగును.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

92. బ్రహ్మాభిన్నత్వ విజ్ఞానం భవమోక్షస్య కారణమ్
యేనాద్వితీయ మానందం బ్రహ్మసంపద్యతే బుధైః.

తా. "నేను బ్రహ్మము కంటె వేరుకాను" - అను విజ్ఞానముచే జీవునకు మోక్షము కలుగును. మరియు ఇట్టి విజ్ఞానము వలన అద్వితీయ మగు బ్రహ్మానందము కూడ సంప్రాప్తమగును.

వ్యాఖ్యానము - తాను బ్రహ్మము కంటె వేరుగ యున్నాడను భావన జీవునకు బంధమును చేకూర్చును. వాస్తవముగ జీవ, బ్రహ్మాలు వేరుకారు. వేరను భావము కలిగియున్నచో సంసారబంధములో చిక్కువడుదురు. కాబట్టి మోక్షకాంక్షులు బ్రహ్మాభిన్నత్వ విజ్ఞానము కలిగియుండవలెను. దీనినే సమ్యక్జ్ఞానమందురు. అద్దానివలననే జీవునకు బ్రహ్మానుభూతి, పరమశాంతి చేకూరును. కనుక నిత్యము - అహంబ్రహ్మాస్మి - అను మహావాక్యము యొక్క అర్థమును చింతన చేయుచుండవలెను. ఒక్క క్షణమైనను వృథాగ గడుపరాదు.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

93. ఛాయాశరీరే ప్రతిబింబగాత్రే
యత్స్వప్నదేహే హృదికల్పితాంగే
యథాత్మబుద్ధిస్తవ నాస్తికాచిత్
జీవచ్ఛరీరే చ తథైవ మాస్తు.

తా. శరీరము యొక్క నీడయందును, దాని ప్రతిబింబము నందును, స్వప్నమందలి దేహమందును, హృదయమున కల్పింపబడిన శరీర మందును సత్యబుద్ధి లేనట్లు జీవించియున్న దేహమందును కూడ నీకు సత్యబుద్ధి లేకుండుగాక!

వ్యాఖ్యానము – నీడ యొక్క ఆకారము శరీరమువలె యున్నప్పటికి అది శరీరము కాదు. దానిని శరీరముగ ఎవరును స్వీకరింపరు అట్లే నిలువటద్దము నందలి మానవుని స్వరూపమును ఎవరును మానవునిగ స్వీకరింపరు. అట్లే స్వప్నమందలి దేహమును, హృదయ మందు కల్పింపబడిన దేహమును ఎవరును మానవునిగ అంగీకరింపరు. ఈ నాలుగు దృష్టాంతములలోని మానవులయందు వలె జీవించియున్న మానవుని యందు కూడ సత్యబుద్ధి లేకుండ యుండవలెను. ఆత్మ ఒకటియే సత్యము.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

94. దేహేంద్రియాదావసతి భ్రమోదితాం
విద్వానహన్తాం న జహాతి యావత్
తావన్న తస్యాస్తి విముక్తి వార్తా
ప్యస్త్యేష వేదాన్తనయాన్త దర్శీ.

తా. పండితుడైనను ఎంతవరకు తాను దేహము అను భ్రాంతిని, అహంకారమును విడువడో అంతవరకు మోక్షము అనుమాట వినుటకేగాని అనుభవమునకు రాదు.

వ్యాఖ్యానము - దేహము, ఇంద్రియములు మున్నగునవి వాస్తవముగ సత్యములు కావు. భ్రమోదితములైన అట్టి దేహేంద్రియాదులు తానని భావించుట హాస్యాస్పదమే యగును. తాను ఎంతగొప్ప విద్వాంసుడైనను దేహాభిమానము, అహంభావము కలిగియుండుచో అతనికి మోక్షము కలుగనే కలుగదు. కనుక ఎట్టి విద్వాంసుడైనను ఆత్మ విచారణను లెస్సగ చేసి తాను దేహము కాదు ఆత్మ అని తలంపవలెను. అపుడే మోక్షము. కరతలామలక మగును.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

95. ఆత్మత్వబుద్ధిం త్యజ మూఢబుద్ధే
త్వఙ్మాంసమేదోస్థిపురీషరాశౌ
సర్వాత్మని బ్రహ్మణి నిర్వికల్పే
కురుష్వ శాన్తిం పరమాం భజస్వ.

తా. చర్మము, మాంసము, మేదస్సు ఎముకలు, మలమూత్రములతో కూడిన దేహము నందు ఆత్మబుద్ధిని (నేనను బుద్ధిని) విడువుము. సర్వాత్మయగు పరబ్రహ్మమునందు నిర్వికల్పసమాధి స్థితిని పొంది పరమశాంతిని అనుభవించుము.

వ్యాఖ్యానము – శ్రుతులు, స్మృతులు మున్నగునవన్నియును జీవుడు బ్రహ్మమేయని ఘోషించుచున్నవి. అనుభవజ్ఞులగు గురువులు కూడ ఆ విధముగనే చెప్పుచున్నారు. కాబట్టి మలమూత్రములతో కూడిన దేహము నిత్యశుద్ధ బుద్ధ ముక్త బ్రహ్మమని, ఆత్మయని ఎపుడును తలంపరాదు. ఆకాశము వలె నిర్మలమైన ఆత్మయే తానని అహర్నిశ ములు చింతన చేయుచుండవలెను.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

96. దేహోఽహమిత్యేవ జడస్యబుద్ధి
ర్దేహే చ జీవే విదుషస్త్వహం ధీః
వివేక విజ్ఞానవతో మహాత్మనో
బ్రహ్మాహమిత్యేవ మతిః సదాత్మని.

తా. 1) జడబుద్ధి అగు అజ్ఞాని దేహమును ఆత్మగ భావించును

2) శాస్త్ర జ్ఞానము గల విద్వాంసుడు జీవుడే ఆత్మయని గ్రహించును.

3) వివేక విజ్ఞానములు గల మహాత్ముడు పరబ్రహ్మమే ఆత్మయని భావించి బ్రహ్మమందు స్థితుడై యుండును.

వ్యాఖ్యానము - జనులలో మూడు తరగతులవారు గలరు 1) అజ్ఞాని, 2) పండితుడు, 3) బ్రహ్మజ్ఞాని అని. అజ్ఞాని దేహమే తానని, పండితుడు జీవుడే (చిదాభాసుడే) తానని, బ్రహ్మజ్ఞాని ఆత్మయే తానని తలంచును.

ఈ ముగ్గురిలో మొదటి ఇరువురి భావములు సత్యములు కావు. బ్రహ్మజ్ఞానియొక్క భావమే సత్యము. తాను వాస్తవముగ ఆత్మయే, కాని శరీరముగాని, చిదాభాసుడుగాని జీవుడు గాని కాదు.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

97. త్వఙ్మాంసమేదోస్థిపురీషరాశౌ
అహం మతిం మూఢజనః కరోతి
విలక్షణం వేత్తి విచారశీలో
నిజస్వరూపం పరమార్థ భూతమ్.

తా. చర్మ, మాంస, మేదో, అస్థి, మలరాశియగు శరీరమందు అహం భావము కలిగి అజ్ఞాని దుఃఖముల పాల్పడుచున్నాడు. వివేక విజ్ఞానములు కలిగిన తత్త్వజ్ఞాని సచ్చిదానంద ఆత్మయే తానని భావించి పరమశాంతిని, ఆనందమును అనుభవించుచున్నాడు.

వ్యాఖ్యానము – అజ్ఞాని యొక్కయు, వివేకవంతుడగు జ్ఞానియొక్కయు భేదమును ఇచట వివరించుచున్నారు. మలమూత్రములతో కూడిన దేహమే తానని ఒకడు భ్రమించుచున్నాడు. ఆ భ్రమ యొక్క ఫలితముగ దుఃఖమును, అశాంతిని పొందు చున్నాడు. మరొకడు వివేకవంతుడై సచ్చిదానంద ఆత్మయే తానని తెలుసుకొని అట్టి ఆత్మయందు స్థితిగలవాడై పరమానందమును పొందుచున్నాడు.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

98. ముంజాదిషీకామివ దృశ్యవర్గాత్
ప్రత్యంచ మాత్మాన మసంగమక్రియమ్
వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వం
తదాత్మనా తిష్ఠతి యస్సముక్తః.

తా. పై పొరలను తీసివేయగా ముంజగడ్డి నుండి ప్రవృద్ధికి హేతు భూతమైన సూక్ష్మాంకురము శేషించును. అట్లే దృశ్యవర్గమగు పంచకోశములను వేరు చేసినచో అసంగము, అక్రియము అగు ఆత్మ యొక్క దర్శనమగును. అట్టి ఆత్మ యందు సుస్థిరుడైనవాడే ముక్తుడగును.

వ్యాఖ్యానము - ముంజగడ్డిని వేరుచేసి పూజకు అవసరమైన గడ్డిని గైకొందురు. అట్లే పంచకోశములను వేరుచేసి లోపల ప్రకాశించుచున్న ఆత్మను తెలుసుకొని బ్రహ్మనిష్ఠుడు అద్దాని యందు స్థితికలిగి పరమానందమును పొందును. దీనినే క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగమందురు. దృగ్దృశ్యవివేకమనియు చెప్పుదురు. ఇక్కార్యమునకై వివేకము, విజ్ఞానము ఎంతయో అవసరము.

## తత్త్వమసి

ఓం ఓం సోऽహం, సోऽహం, శివోऽహం, శివోऽహం -
చిదానందరూప శ్శివోऽహం శివోऽహం.

99. నాస్త్రైర్న శస్త్రైరనిలేన వహ్నినా
ఛేత్తుం న శక్యో న చ కర్మకోటిభిః
వివేకవిజ్ఞానమహాసినా వినా
ధాతుః ప్రసాదేన సితేన మంజునా.

తా. అస్త్రము, శస్త్రము, వాయువు, అగ్ని, కోటికర్మలు - ఇవేవియు అజ్ఞానబంధమును తొలగింప సమర్థముకావు. దైవానుగ్రహముచే లభించిన వివేక విజ్ఞానమను మహాఖడ్గము చేతనే అవిద్యా బంధము నశించును.

వ్యాఖ్యానము - చీకటిని పోగొట్టుటకు ఒక్క ప్రకాశమే ఎట్లు అవసరమో అట్లు బహు జన్మార్జిత అజ్ఞాన పంకిలమును పోగొట్టుటకు జ్ఞానము, వివేకము అవసరము. వివేక ఖడ్గము చేతనే ఆ అజ్ఞానము నిర్మూలమగును. దైవకృప చేతనే ఆ వివేకము లభించును.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

100. న జాయతే నో మ్రియతే న వర్ధతే
న క్షీయతే నో వికరోతి నిత్యః
విలీయమానేఽపి వపుష్యముష్మిన్
న లీయతే కుంభ ఇవాంబరం స్వయమ్.

తా. ఆత్మకు చావుపుట్టుకలు, పెరుగుట, నశించుట మొదలగు వికారము లేవియు లేవు. దేహమందున్నను ఆత్మకు దేహనాశముతో ఏ సంబంధములేదు. ఘటము నశించినను ఘటాకాశము నశింపదు గదా!

వ్యాఖ్యానము - ఆత్మయొక్క స్వరూప స్వభావములను ఇచట వర్ణించు చున్నారు. పుట్టుట, చచ్చుట మున్నగు షడ్భావవికారములు దానికి లేవు. శరీరముతో సంబంధము కలిగియున్నప్పటికిని ఘటము పగిలినపుడు ఘటాకాశము మహాకాశములో లీనమగునట్లు ఆత్మ పరమాత్మ యందు లీనమగును. కాబట్టి ఎవరును శరీరనాశముచే దుఃఖింపనవసరము లేదు. అనంతమగు చిదాకాశమే జీవుని యొక్క యథార్థ స్వరూపము.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

101. శీతోష్ణసుఖదుఃఖాది నిజదేహగతాన్యపి
అన్యదేహగతానీవ జ్ఞః పశ్యత్యవహేలయా.

తా. శీతోష్ణములు, సుఖదుఃఖములు మున్నగునవి తన దేహమునకు సంభవించినను జ్ఞాని మరొక దేహమునకు సంభవించినవిగ తలంచి వాటిని గూర్చి తలంపకయే యుండును.

వ్యాఖ్యానము – జ్ఞానికి బ్రహ్మాండమంతయు తన కుక్షియందున్నట్లే యుండును. ఒక్కదేహమే కాదు ప్రపంచములోని దేహములన్నియు తనవిగనే ఎంచును. అట్టి స్థితిలో సుఖదుఃఖాదులుగాని, శీతోష్ణాదులుగాని తన దేహమునకు సంభవించినట్లు తలంపడు. ఎవనికో కలిగిన సుఖ దుఃఖములు తనకు కలిగినవని జ్ఞాని ఎట్లు తలంపడో అట్లే తనకు కలిగిన సుఖ దుఃఖాదుల యెడల కూడ అతడు నిర్లక్ష్యముగ యుండును. మనస్సే లేనపుడు ఇక మనస్సు వలన కలిగిన సుఖ దుఃఖము లెట్లుండును?! ఇట్టి భావములు కలిగి జ్ఞాని ఆనందముగ పరమశాంతితో కాలమును గడుపు చుండును. జ్ఞానియొక్క ఈ లక్షణములను తక్కినవారు చక్కగ అభ్యసింపవలెను. అపుడే జీవితము ఆనందమయముగ గడచును.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

102. రజ్జుసర్పవదాత్మానం జీవం జ్ఞాత్వా భయం వహేత్
నాహం జీవః పరాత్మేతి జ్ఞాతశ్చేన్నిర్భయో భవేత్.

తా. త్రాటిని చూచి పామను కొన్నచో భయము గలుగునట్లు తనను జీవునిగ తలంచినచో భయము కలుగును. నేను జీవుడనుకాను పరమగు ఆత్మను - అని నిశ్చయించుకొనినచో నిర్భయత్వము కలుగును.

వ్యాఖ్యానము - శాస్త్రములలో తరచు వచ్చుచుండు ఒక ఉపమానము ఇచట చెప్పబడినది. అదియే రజ్జుసర్పభ్రాంతి. కొద్ది చీకటిలో రాత్రి ఒకడు ఒక త్రాటిని చూచి అది పామని భ్రమచెంది గడగడలాడెను. పాము పాము అని కేకలు వేసెను. అతని గుండె దడ దడ లాడెను. కాని దీపము తెచ్చి చూచినచో అచట పాము లేనే లేదు. భ్రాంతివలననే ఈ వికారములన్నియు కలిగెను. జీవుడు వాస్తవముగ బ్రహ్మస్వరూపుడే. కాని అజ్ఞానముచే జీవుడని భావించి భయమును, దుఃఖమును పొందుచున్నాడు. గురుబోధ వలన, శాస్త్ర విజ్ఞానము వలన, తత్త్వమసి అను బోధవలన తనను బ్రహ్మముగ నిశ్చయించుకొని భయమును పారద్రోలి నిర్భయుడై ప్రవర్తించవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

103. అనుభూతే రభావేపి బ్రహ్మాస్మీత్యేవ చింత్యతామ్
అప్యసత్ప్రాప్యతే ధ్యానాత్ నిత్యాప్తం బ్రహ్మ కిం పునః.

తా. అనుభవము లేనప్పటికిని బ్రహ్మ చింతనయే చేయవలెను. ఏల యనగా ధ్యానముచే అసత్తగు వస్తువులే సంప్రాప్తించు చున్నపుడు ఇక ఎల్లపుడు పొందబడియే యున్న బ్రహ్మము ఏల పొంద బడదు ?!

వ్యాఖ్యానము - బ్రహ్మము అనునది క్రొత్తగ పొందబడు ఒక వస్తువు కాదు. జీవుడు తాను బ్రహ్మయే అయియున్నాడు. మొదటలో అట్టి అనుభవము ఒకవేళ లేకపోయినను "నేను బ్రహ్మమును, నేను బ్రహ్మమును" - అని నిత్యము ధ్యానించు చుండవలెను. కొంతకాలమునకు అతనికి అనుభూతి తప్పక కలుగును. మధ్యలో మానరాదు. నిరంతరధ్యానము జరుగుచునే యుండవలెను. పిరికి తనము పనికిరాదు. అహంబ్రహ్మాస్మి - అని ఎలుగెత్తి పాడవలెను.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

104. యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే.

తా. ఆకాశము సర్వత్ర వ్యాపించి యున్నప్పటికిని ఏ వస్తువుతోను తగుల్కొనక యుండునట్లు - ఈ దేహములో సర్వత్రవ్యాపించి యున్నప్పటికిని ఆత్మ దేనితోను తగుల్కొనుట లేదు.

వ్యాఖ్యానము - ఈ శ్లోకమున చక్కని దృష్టాంతము చెప్పబడినది. అదియే ఆకాశము. ఆకాశము బ్రహ్మాండమంతయు వ్యాపించి యున్నప్పటికిని ఒక్కవస్తువుతో కూడ తగుల్కొనుట లేదు. అది నిస్సంగముగ యున్నది. నిర్లేపముగ యున్నది. అట్లే ఆత్మ శరీరమంతటా వ్యాపించి యున్నప్పటికిని దేనితోను తగుల్కొనక నిస్సంగముగ, నిర్లేపముగ వ్యవహరించుచున్నది. సాధకుడు అట్టి నిర్లేపమగు ఆత్మయే తానని పదేపదే భావించవలెను. ఆకాశ దృష్టాంతమును మరల మరల జ్ఞప్తికి తెచ్చుకొనవలెను. తాను ఆకాశము కంటె సూక్ష్మమైన చిదాకాశమని జ్ఞప్తియందుంచు కొనవలెను. ధైర్యముతో మెలగ వలెను. విజ్ఞతతో వ్యవహరింప వలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

105. ప్రాతః స్మరామి హృది సంస్ఫురదాత్మతత్త్వం
సచ్చిత్సుఖం పరమహంసగతిం తురీయమ్
యత్స్వప్న జాగర సుషుప్తి ముపైతి నిత్యం
తద్బ్రహ్మ నిష్కలమహం న చ భూత సంఘః.

తా. హృదియమున లెస్సగస్ఫురించునదియు, సచ్చిదానంద స్వరూపమును, పరమహంసలకు లక్ష్యమును, తురీయ స్వరూపమును, జాగ్రత్స్వప్నసుషుప్తులను ఎల్లపుడు సాక్షిగ తెలుసుకొనునదియు, అగు ఆత్మతత్త్వమును ప్రాతః కాలమున నమస్కరించుచున్నాను. ఆ ఆత్మయే, బ్రహ్మయే నేనుగాని పంచభూతాత్మకమగు జడమైన దేహముకాదు.

వ్యాఖ్యానము – సమస్త ప్రాణికోట్ల యొక్క హృదయములలో ఆత్మ ప్రకాశించుచున్నది. అన్నిటికంటె గొప్పవస్తువు ఆత్మయే కాబట్టి ఉదయము నిద్ర లేవగనే ఆత్మకు నమస్కరించవలెను. ఆత్మదూరమున లేదు. సమీపమున కూడ లేదు. మన స్వరూపముగనే వెలయుచున్నది. అది సచ్చిత్స్వరూపము, ఆనందసాగరము, పరమహంసలకు అదియే లక్ష్యము. జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడవస్థలను ఆ ఆత్మయే సాక్షిగ వీక్షించుచున్నది. ఆ అవస్థల యందు జరుగు కార్యములు ఆత్మను అంటనే అంటవు. అట్టి ఆత్మయే నేను గాని జడమైన దేహము కాదు.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

106. మనో బుద్ధ్యహంకార చిత్తానినాహం
న చ శ్రోత్రజిహ్వే న చ ఘ్రాణనేత్రే
న చ వ్యోమభూమి ర్నతేజో న వాయుః
చిదానందరూప శ్శివోఽహం శివోఽహమ్.

తా. మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము, శ్రోత్రేంద్రియము, జిహ్వేంద్రియము, ఘ్రాణేంద్రియము, నేత్రేందియము, ఆకాశము, భూమి, అగ్ని జలము, వాయువు - ఇవేవియు నేను కాదు. చిదానందరూపమగు శివస్వరూప ఆత్మయే నేను, ఆత్మయే నేను.

వ్యాఖ్యానము - సామాన్యముగ అజ్ఞాన స్థితిలో యున్నవారు కనుపించు దేహమే తామని తలంచుదురు. అది చాల పొరపాటు. దేహము గాని, ఇంద్రియములుగాని, మనస్సుగాని, పంచభూతములు గాని జీవుడు కానేకాదు. చిదానందరూపమగు శివస్వరూపమైన ఆత్మయే జీవుడు. శివోఽహం, శివోఽహం - అని పదేపదే స్మరించ వలెను. ఆత్మకు అన్యమైన సమస్త దృశ్యపదార్థము మిథ్యయే యగును. లేనివస్తువు తానెట్లగును. కాబట్టి ఉన్నవస్తువుగు ఆత్మయే తానని పదేపదే మననము చేయుచుండవలెను. అమూల్యమగు మానవ జీవిత సమయమును ఒక్క క్షణమైనను పోగొట్టరాదు.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

**107. అహమేవ హృదాకాశే చిదాదిత్య స్వరూపవాన్**
**ఆత్మనాఽఽత్మని తృప్తోఽస్మి హ్యరూపో స్మ్యహమవ్యయః.**

తా. ఆకాశమున సూర్యుడెట్లు ప్రకాశించుచున్నాడో అట్లే హృదయాకాశమున ఆత్మసూర్యుడు ప్రకాశించుచున్నాడు. ఆ ఆత్మయే నేను. అట్టి ఆత్మయందే నేను తృప్తుడనై యున్నాను. నాకు రూపము లేదు. నేను నాశరహితుడను.

వ్యాఖ్యానము - ఆకాశమున సూర్యునివలె హృదయాకాశమున ఆత్మ భాస్కరుడు ప్రకాశించుచున్నాడు. అట్టి జ్ఞాన సూర్యుడనే నేను. అట్టి ఆత్మయందే నేను తృప్తుడనై యున్నాను. ఆత్మకు నామ రూపములు లేవు. అది శాశ్వతము. కాబట్టి సమయమంతయు అట్టి ఆత్మచింతనయందే గడుప వలెను. దృశ్య వ్యామోహములో పడి జీవితమును వృథాచేయరాదు. భోగవిలాసముల వెంట పరుగిడుట చేత జీవితము వ్యర్థముగ గడచిపోవును.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

**108. చైతన్యమాత్రమోంకారం బ్రహ్మైవ సకలం స్వయమ్**
**అహమేవ జగత్సర్వమహమేవ పరంపదమ్.**

తా. చైతన్యమే ఓంకారము, అదియే బ్రహ్మము. అంతయు స్వయముగ బ్రహ్మయే. అట్టి బ్రహ్మస్వరూపమే మహత్తర పదమే నేను. ఈ జగత్తంతయు నేనే.

వ్యాఖ్యానము - బ్రహ్మము యొక్క నామధేయము ఓంకారము. దానినే ప్రణవమందురు. ప్రతిజీవుడున్ను ఆత్మస్వరూపుడే, బ్రహ్మ స్వరూపుడే కాబట్టి అట్టి ఆత్మ స్వరూపముతో జీవుడు అణువణువ్యు బ్రహ్మాండ మంతయు వ్యాపించి యున్నాడు. కనుక ఏ ప్రాణికిన్ని కీడు చేయరాదు. ''సర్వభూతహితేరతాః'' - అని భగవద్గీతలో చెప్పినట్లు ప్రతి ప్రాణియెడల ప్రేమ, దయ, కరుణ కలిగి ఆత్మౌపమ్య సిద్ధాంతమును ఆచరణయందుంచుచు తనవలె ఇతరులను చూచుచుండవలెను. అహంబ్రహ్మాస్మి అను వేదవాక్యమును నిరంతరము జ్ఞప్తియందుంచుకొని విశాల భావమును ప్రకటించవలెను. చిత్తమందు ఏ కోశమునను వైరము కలిగియుండరాదు.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

**109. సచ్చిదానందమాత్రోఽహ మనుత్పన్నమిదం జగత్**
**కాలం నాస్తి జగన్నాస్తి మాయాప్రకృతి రేవ న.**

తా. నేను సచ్చిదానంద మాత్ర స్వరూపుడను. ఈ జగత్తు వాస్తవముగ ఉత్పన్నమే కాలేదు. కాలముగాని, జగత్తుగాని వాస్తవముగ లేవు. అట్లే మాయగాని, ప్రకృతిగాని కూడ లేవు.

వ్యాఖ్యానము – జీవుడు బ్రహ్మస్వరూపుడే. ఉన్నది ఒక్క వస్తువే. అదియే బ్రహ్మము అదియే జీవుని వాస్తవ స్వరూపము. ఇక తక్కినవేవియు లేవు. జగత్తుగాని, కాలముగాని, మాయగాని, ప్రకృతిగాని లేవు. ఉన్న వస్తువగు బ్రహ్మమును గూర్చియే విచారించి అద్దానియందు స్థితి కలిగి యుండవలెనేగాని లేనిదానిని గూర్చి చింతన చేయుచు కాలమును వృథా చేయరాదు. సత్యవస్తువును గూర్చిన విచారణ యందే కాలమును వినియోగించవలెను. తత్త్వమసి (నీవు ఆ బ్రహ్మమే అయియున్నావు) అని వేదములు పలుకు చున్నవి కావున ఆ మహోన్నతమైన వేదవాక్యమును లెస్సగ మననము చేయుచు ఆ బ్రహ్మమునందే నిలకడ కలిగియుండవలెను.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం – చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

110. ప్రాణాశ్చలన్తు తద్ధర్మైః కామైర్వా హన్యతాం మనః
స్వభావానంద పూర్ణస్య మమ దుఃఖం కథం భవేత్.

తా. ప్రాణములు వాని ధర్మముల నుండి చలించుగాక! మనస్సు కోరికలచే హతమగుగాక! ఆత్మానంద పరిపూర్ణుడైన నాకు దుఃఖమెట్లు కలుగును?

వ్యాఖ్యానము – దేహమందు ప్రాణములు తమతమ ధర్మములనుండి చలించినప్పటికి, కామములచే మరియు ఇతర వికారములచే మనస్సు కొట్టబడినప్పటికి ఆనంద పరిపూర్ణుడగునాకు దుఃఖమేల కలుగును? – అని బ్రహ్మానుభూతి కలిగిన ఒక మహనీయుడు పలుకుచున్నాడు. ఆత్మకు దేహముతో ఏ సంబంధమున్ను లేదు. అట్టిచో ఆ దేహమునకు సంబంధించిన వికారములు ఆత్మకేల కలుగును? కనుకనే ఆ బ్రహ్మనిష్ఠుడు ధైర్యముతో అట్లు పలుకుచున్నాడు. శరీరములో కలుగు వికారములన్నిటిని ఆత్మ సాక్షిగ చూచుచున్నది. శరీరమునకు కలుగు షడ్భావ వికారములన్నిటికి ఆత్మ సాక్షి. గృహములో జరుగు పనులన్నిటికి దీపము సాక్షిగ యుండి నిర్వికారముగ చూచుచున్నది. అట్టి సాక్షియగు ఆత్మయే నేనని భావించి జీవుడు కూడ నిశ్చలుడై, నిర్వికారుడై యుండ వలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

**111. ధన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మానమంజసా వేద్మి**
**ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానందో విభాతి మే స్పష్టమ్.**

తా. నేను ధన్యుడను, ధన్యుడను, సదా ఆత్మ స్వరూపమును చక్కగ ఎరుగుచున్నాను. బ్రహ్మానందము నాకు స్పష్టముగ అనుభూత మగుచున్నది.

వ్యాఖ్యానము - బ్రహ్మానుభవము కలిగిన ఒక జ్ఞాని ఎలుగెత్తి పలికిన పలుకులివి. సామాన్యముగ ఏదైన గొప్పవస్తువు లభించినపుడు - "ఆహా! నా అదృష్టమేమని చెప్పవచ్చును!" - అని పలుకుదురు. జగత్తులో అన్నిటికంటె గొప్పవస్తువు ఆత్మ, బ్రహ్మము. కనుకనే అది లభించినపుడు - నేను బ్రహ్మమును స్పష్టముగ తెలునుకొను చున్నాను, బ్రహ్మానందమును స్పష్టముగా అనుభవించుచున్నాను. - అని జ్ఞాని చెప్పుచున్నాడు. అట్టి స్థితిలో జీవుడు పరిపూర్ణా నందమును పొందుచు దుఃఖము లవలేశమైనను లేక బ్రహ్మానంద సాగరములో నిమగ్నుడై యుండును. అట్టి అనుభూతియే జీవుని లక్ష్యము.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

112. మత్తో నాన్యత్కించిదత్రాస్తి విశ్వం
సత్యం బాహ్యం వస్తుమాయోపక్లుప్తమ్
ఆదర్శాన్త ర్భాసమానస్య తుల్యం
మయ్యద్వైతే భాతి తస్మాచ్ఛివోఽహమ్.

తా. నా కంటె వేరుగ ఈ జగత్తు ఒకింతైనను లేదు. సత్యవస్తువు మాయచేత కప్పబడి బాహ్యమున నున్నట్లు తోచు చున్నది. అద్దములోపల వస్తువు ప్రతిబింబించునట్లు అద్వైతరూపుడగు నా యందు ఈ జగత్తు భాసించుచున్నది. కనుక నేను శివ స్వరూపమగు ఆత్మయే అయియున్నాను.

వ్యాఖ్యానము – ఈ జగత్తు ఉన్నదా లేదా? అను ప్రశ్నకు ఇట చక్కని సమాధానము చెప్పబడినది. అద్దములో ప్రతిబింబము యున్నదా లేదా? అను ప్రశ్నకు ఉన్నదనియు, లేదనియు కూడ చెప్ప వచ్చును. ఈ జగత్తు ఆత్మ అను ఆధారము గలిగి ఆత్మయందు ప్రతిబింబించి కానుపించుచున్నది. ప్రతిబింబము కానుపించు చున్నది. ప్రతిబింబము ఆభాసమేగాని సత్యము కాదు. జగత్తునకు ఆధారభూతుడగు అద్వయ బ్రహ్మ స్వరూపుడనైన నేను సత్య మును. అద్దమునందు ప్రతిబింబమువలె నాయందు ప్రతిబింబించిన ఈ జగత్తు అసత్యము. నాకంటె వేరుగ ఏదియును లేదు. ఇట్టి మహోన్నత భావములను చక్కగ మననము చేయుచు శివోఽహం శివోఽహం అని ఎలుగెత్తి పాడుచు బ్రహ్మానుభూతిని చక్కగ మననము చేయుచు ఆనందమును అనుభవించుచుండవలెను.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

113. దృగ్దృశ్యౌ ద్వౌపదార్థౌ స్తః పరస్పరవిలక్షణౌ
దృగ్బ్రహ్మ దృశ్యంమాయేతి సర్వవేదాన్తడిండిమః.

తా. దృక్కు, దృశ్యము అను రెండు పదార్థములు పరస్పర విలక్షణ ములు కలిగియున్నవి. అందు ద్రిక్కు బ్రహ్మము, దృశ్యము మాయ అని సమస్త వేదాంతములు ఘోషించుచున్నవి.

వ్యాఖ్యానము – ఈ జగత్తులో రెండు వస్తువులు గలవు. ఒకటి దృక్కు, రెండు దృశ్యము. ఆ రెండును పరస్పరము విలక్షణ స్వభావములు గలవి. వీటిలో దృక్కు బ్రహ్మము, దృశ్యము మాయ. దృక్కగు బ్రహ్మము సద్వస్తువు, దృశ్యమగు మాయ అసద్వస్తువు (లేనిది). ప్రతి జీవియొక్క యథార్థస్వరూపము దృక్కగు బ్రహ్మమే. అది ఆనందమయము. కాబట్టి ఎవరును దుఃఖింప నవసరములేదు. ప్రతి జీవియు మూర్తీభవించిన సుఖము, నిర్వికారమైన ఆ బ్రహ్మము నందు స్థితికలిగియుండుట ప్రతిజీవియొక్క కర్తవ్యము. ధ్యానమును చక్కగ అభ్యసించి మనస్సును ఆత్మయందు నెలకొల్పినచో ఇక జీవునకు పరిపూర్ణమైన ఆనందము, దుఃఖరాహిత్యము సిద్ధంచును.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

114. హృదయకమలమధ్యే దీపవద్వేదసారం
ప్రణవమయమతర్క్యం యోగిహృద్ధ్యాన గమ్యమ్
హరిగురు శివయోగం సర్వభూతస్థమేకం
సకృదపి మనసా యశ్చిన్తయేత్స్యాత్స ముక్తః.

తా. హృదయకమల మధ్యమున దీపమువలె వెలుగునదియు, వేద సారమైనదియు, ప్రణవమయమైనదియు, తర్కములకు అతీత మైనదియు, యోగులకు హృదయమున ధ్యానముచే పొందబడు నదియు హరిగురు శివ సంయోగ స్వరూపమైనదియు, సమస్త ప్రాణులందు యుండునదియు, ఏకమైనదియు, - అగు పర మాత్మను ఎవడు ఒక్కసారియైనను మనస్సుతో ధ్యానించునో అట్టివాడు ముక్తుడగును.

వ్యాఖ్యానము - బ్రహ్మము ప్రతి జీవియొక్క హృదయమందు దీపము వలె ప్రకాశించుచుండును. వేదశాస్త్రము లెన్నియో ఉన్నప్పటికిని వాటి యన్నిటి యొక్క సారము ఓంకారమే. ప్రణవ స్వరూప పర బ్రహ్మయే. ఆ బ్రహ్మము తర్కమునకు అతీతమైనది, యోగులకు ధ్యానముచే పొందబడునది, హరిగురు శివసంయోగరూపమైనది, సమస్త ప్రాణులందును ఏకముగ నున్నది. అట్టి పరబ్రహ్మమును ఒక్కసారియైనను ధ్యానించువాడు, చింతన చేయువాడు ముక్తి నొందును. ఇక నిరంతర బ్రహ్మ చింతన చేయువానికి మోక్ష విషయమై వేరుగ చెప్పవలెనా ?!

## తత్త్వమసి

ఓం ఓం సోஉహం, సోஉహం, శివోஉహం, శివోஉహం -
చిదానందరూప శ్శివోஉహం శివోஉహం.

115. మనాగపి న సంబన్ధస్తవ దృశ్యేన వస్తునా
అవిద్యమాన రూపేణ సంబంధః కోఽయమీదృశః.

తా. ఓ చిత్తమా! దృశ్యవస్తువుతో నీకు ఒకింతైనను సంబంధము లేదు. ఏలన లేనివస్తువుతో సంబంధమెట్లు కలుగును ?

వ్యాఖ్యానము – చిత్తమునకు దృశ్యముతో ఏ మాత్రము సంబంధము లేదు. ఏలయనగా దృశ్యము లేని వస్తువు. లేనిదానితో సంబంధ ముండుట హాస్యాస్పదము గదా! ఉన్నవస్తువులతోనే సంబంధము యుండును. మిథ్యా వస్తువులతో ఎట్లు సంబంధము యుండును ? కనుక సత్యవస్తువుయైన బ్రహ్మమునందే, ఆత్మయందే మనస్సును నెలకొల్పి బ్రహ్మానందమునను భవించు చుండవలెను. అసత్య వస్తువులపైకి మనస్సును పోనివ్వక సత్యవస్తువునందే స్థితి కలిగి యుండునట్లు చేయవలెను. ఉదయము నిద్ర లేచినది మొదలు ఆ బ్రహ్మమును గూర్చియే చింతన చేయుచు కాలమును సద్వినియోగ పరుచవలెను.

## అహంబ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

116. ప్రజహాతి యదా కామాన్సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే.

తా. ఎవడు మనస్సులోని కోరికలన్నిటిని లెస్సగ తొలగించివేయునో, మనస్సును ఆత్మయందు నెలకొల్పి ఆత్మయందే సంతుష్టుడై యుండునో - అట్టివాడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

వ్యాఖ్యానము - అనేక జన్మల నుండి ఎన్నియో కోరికలు జీవుని చిత్తమందు రూఢిపడియుండును. వాటియన్నిటిని ఒక్కొక్కటిగ తొలగించి వేసి, మనస్సును ఇతరత్ర పోనివ్వక, ఆత్మయందే నెలకొల్పి, ఆత్మయందే సంతుష్టుడై యుండవలెను. అట్టివాడే స్థితప్రజ్ఞుడు, జీవన్ముక్తుడు. ప్రతిజీవియు ప్రయత్న పూర్వకముగ ఆత్మయందు స్థితికలిగియుండుటను అభ్యసించవలెను. ఒక వేళ మనస్సు ఇతరత్ర పోవుచున్నచో దానిని కనిపెట్టి వివేక వైరాగ్యముల సహాయముచే విషయములపై నుండి లాగి ఆత్మ యందు స్థాపించవలెను. ఇదియే జీవుని కర్తవ్యము.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం -
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

**117.** బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయమశ్నుతే.

తా. బాహ్యశబ్దాది విషయములందాసక్తి లేనివాడు ఆత్మయందు ఎట్టి సుఖము గలదో అట్టి సుఖమునే పొందు చున్నాడు. అతడు బ్రహ్మనిష్ఠయను సమాధితో కూడుకొనినవాడై అక్షయసుఖమును బడయు చున్నాడు.

వ్యాఖ్యానము – శబ్ద స్పర్శ రూప రస గంధములను విషయములపైకి మనస్సును పోనివ్వక అంతర్ముఖము చేసి ఆత్మయందు స్థాపించినచో అట్టి బ్రహ్మయోగ యుక్తుడు అక్షయ సుఖమును పొందును. అజ్ఞానులు విషయములందేదో సుఖమున్నదని పరుగిడుచున్నారే గాని అది అల్పమైన సుఖము, దుఃఖమిశ్రితమైన సుఖము, క్షయసుఖము. కొద్దిసేపు సుఖము గలిగినప్పటికిని మరల దుఃఖము ఆవరించును. కనుక విజ్ఞులు అట్టి అల్పసుఖమునకై ప్రాకులాడక శాశ్వతమగు బ్రహ్మానందము కొరకై ప్రయత్నించవలెను. అది బయటలేదు. లోపలనే యున్నది.

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం –
చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

**118. యోఽన్తస్సుఖోఽ న్తరారామ స్తథాన్తర్జ్యోతి రేవ యః**
**స యోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మభూతోఽధి గచ్ఛతి.**

తా. ఎవడు లోపల ఆత్మయందే సుఖించుచు, ఆత్మయందే క్రీడించుచు, ఆత్మయందే ప్రకాశము గలవాడై యుండునో అట్టియోగి బ్రహ్మస్వరూపుడై బ్రహ్మసాక్షాత్కారమును పొందును.

వ్యాఖ్యానము - పరిపూర్ణసుఖము ఎక్కడనున్నదని ఎవరికైన సందేహము గలిగినచో ఈ శ్లోకము ఆ సందేహమును నివారించు చున్నది. దీనిని సామాన్యులు చెప్పలేరు. సాక్షాత్ అవతారమూర్తియైన శ్రీ కృష్ణపరమాత్మ భగవద్గీత యందు బోధించెను. పరిపూర్ణసుఖము, పరిపూర్ణశాంతి, పరిపూర్ణ జ్ఞానము (జ్యోతి) అంతరంగముననే గలవు. అది మోక్షసుఖమే యగును, నిర్వాణసుఖమే యగును. కాబట్టి వివేకవంతులు బాహ్యవిషయ సుఖమున్నకై అపేక్షింపక మనస్సును లోపలకు త్రిప్పి ఆత్మయందు స్థాపించి అక్షయ సుఖశాంతులను పొందవలెను.

## తత్త్వమసి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

119. తస్మాత్సర్వేషుకాలేషు మామనుస్మర యుధ్యచ
మయ్యర్పితమనోబుద్ధి ర్మామేవైష్యత్యసంశయః.

తా. శ్రీ కృష్ణపరమాత్మ అర్జునున కిట్లు బోధించెను - అందువలన (భగవచ్చింతన వలన మోక్షము లభించును కావున) ఎల్లకాలము లందును నన్ను గూర్చి (ఆత్మను గూర్చి) స్మరించుచు యుద్ధము కూడ చేయుము. (నీ విధ్యుక్త ధర్మమును కూడ ఆచరింపుము). ఇట్లు నా యందు (ఆత్మయందు) సమర్పింపబడిన మనోబుద్ధులు గలవాడవైనచో నీవు నన్నే (ఆత్మనే) పొందగలవు. ఇందు సంశయము లేదు.

వ్యాఖ్యానము - జీవితమంతయు భగవత్స్మరణ చేయుచుండిననే అంత్యకాలమున భగవత్స్మరణ కలుగును. దానివలన జన్మ రాహిత్యము సిద్ధించును. అంత్యకాల దైవస్మరణ అకస్మాత్తుగ రాదు. జీవితమంతయు దైవధ్యానమును అభ్యసించుచుండవలెను. యావజ్జీవితము మనస్సును, బుద్ధిని ఆత్మయందు స్థాపించవలెను.

## అహం బ్రహ్మాస్మి

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

120. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్.

తా. ఎవడు 'ఓమ్' అను ఒక్క అక్షరమును ఉచ్చరించుచు నన్ను (ఆత్మను) ఎడతెగక చింతించుచు దేహమును వదలునో అతడు సర్వోత్తమ స్థానమును (మోక్షమును) పొందుచున్నాడు. - శ్రీ కృష్ణపరమాత్మ.

వ్యాఖ్యానము - బ్రహ్మము యొక్క వాచకము ప్రణవము, ఓంకారము. దీనిని ఏకాక్షరమనియు అందురు. ఆ ప్రణవమును జపము చేయుచు దాని భావమును కూడ మననము చేయుచుండవలెను. జీవితమంతయు అట్లు స్మరించుచు, బ్రహ్మచింతన చేయుచు అంత్యకాలమున కూడ అట్టి భగవత్స్మరణతోనే దేహమును వీడువాడు పరమాత్మగతిని పొందును. భగవన్నామ జపము చేయువాడు దాని భావమును కూడ మననము చేయుచుండ వలెను. అపుడే జపము యొక్క పూర్ణ ఫలితము లభించును.

## అయమాత్మా బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

## మహావాక్యములు

**1) ప్రజ్ఞానం బ్రహ్మ 2) తత్త్వమసి, 3) అహంబ్రహ్మాస్మి 4) అయమాత్మా బ్రహ్మ.**

తా. 1) సమస్త ప్రాణికోట్లు ఏ ప్రజ్ఞతో చూచుచున్నవో, విను చున్నవో అట్టి ప్రజ్ఞయే బ్రహ్మము. 2) ఆ బ్రహ్మమే నీవు. 3) నేను ఆ బ్రహ్మమునే అయియున్నాను. 4) ఈ ఆత్మ ఆ బ్రహ్మమే అయియున్నది.

వ్యాఖ్యానము - సమస్త ప్రాణికోట్లు ఏ ప్రజ్ఞతో చూచుచున్నవో, విను చున్నవో ఆ ప్రజ్ఞయే బ్రహ్మము. గురువు శిష్యునకిట్లు బోధించు చున్నాడు - "నాయనా! ఆ బ్రహ్మము నీవై యున్నావు." అది విని శిష్యుడు చక్కగ ధ్యానము చేసి గురువాక్యమును శ్రద్ధతో ఆచరించి ఇట్లు చెప్పుచున్నాడు. "గురుదేవా! ఆ బ్రహ్మము నేనే అయియున్నాను. నాలో యున్న ఆత్మయే ఆ బ్రహ్మము."

## ప్రజ్ఞానం బ్రహ్మ

ఓం ఓం సోఽహం, సోఽహం, శివోఽహం, శివోఽహం - చిదానందరూప శ్శివోఽహం శివోఽహం.

హరి: ఓమ్

# శ్రీ శుకబ్రహ్మాశ్రమము గ్రంథముల వివరములు

| | | |
|---|---|---|
| 1. | గీతా మకరందము | 150-00 |
| 2. | GITA MAKARANDA | 250-00 |
| 3. | యోగివాసిష్ఠరత్నాకరము | 100-00 |
| 4. | రామాయణ రత్నాకరము | 100-00 |
| 5. | భారత రత్నాకరము | 80-00 |
| 6. | భాగవత రత్నాకరము | 80-00 |
| 7. | ఉపనిషద్రత్నాకరము | 60-00 |
| 8. | గీతోపన్యాసములు | 35-00 |
| 9. | మోక్షసాధన రహస్యము | |
| 10. | పరమార్థ కథలు | 40-00 |
| 11. | బ్రహ్మచర్య విజయము | 45-00 |
| 12. | అధ్యాత్మరామాయణము | 18-00 |
| 13. | ఆత్మానుసంధానము | 18-00 |
| 14. | బ్రహ్మానందవైభవము | 18-00 |
| 15. | భజనలు కీర్తనలు | 18-00 |
| 16. | శ్రీవాసిష్ఠమహారామాయణము | 18-00 |
| 17. | అమృతబిందువులు | 18-00 |
| 18. | శ్రీమద్భగవద్గీత(స్థూలాక్షరి) | 20-00 |
| 19. | శ్రీమద్భగవద్గీత(మూలం) | 7-00 |
| 20. | వివేకానందసింహనాదము | 16-00 |
| 21. | శాంతి కిరణాలు | 20-00 |
| 22. | గీతా ముచ్చట్లు | 15-00 |
| 23. | శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల జీవిత చరిత్ర | 35-00 |
| 24. | యమలోక వార్తలు | 5-00 |
| 25. | తత్వసారము | 5-00 |
| 26. | మానసబోధ | 5-00 |
| 27. | పాండవ గీత | 5-00 |
| 28. | అధ్యాత్మ జడ్జిమెంటు | 5-00 |
| 29. | ధ్యాన పద్ధతి | 5-00 |
| 30. | వైరాగ్య సాధన | 4-00 |

| | | |
|---|---|---|
| 31. | మట్టిలో మాణిక్యము | 5-00 |
| 32. | ప్రణవ పూజ | 4-00 |
| 33. | గౌరీపూజావిధానము | 4-00 |
| 34. | ద్వాదశమంజరి | 4-00 |
| 35. | మోక్షద్వారపాలకులు | 4-00 |
| 36. | ఆత్మతత్త్వవిచారణ | 4-00 |
| 37. | ఆధ్యాత్మ హితోక్తులు | 4-00 |
| 38. | ఉపనిషత్కథలు | 20-00 |
| 39. | గుడార్థ దీపిక (భగవద్గీతకు మధుసూదన సరస్వతి స్వామి వ్యాఖ్య) | 30-00 |

## కేసెట్లు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ స్వామివారి ఉపన్యాసములు (సెట్ 1 నుండి 18 అధ్యాయాలు) | |
| 2. | తత్త్వసారము | 35-00 |
| 3. | మానసబోధ | |
| 4. | తత్త్వగీత | |
| 5. | యతిగీత | |
| 6. | పారాయణము (3 కేసెట్లు) | 105 |
| | శ్రీ స్వాములవారి వీడియో కేసెట్లు | |
| | ఒక కేసెట్ (సింగల్) | 150 |
| | ఒక కేసెట్ (డబుల్) | 200 |
| | సెట్ (15 కేసెట్లు) | 2400 |

## మాసపత్రిక

| | |
|---|---|
| వేదాంతభేరి సంవత్సర చందా | 36-00 |
| శాశ్వత చందా | 350-00 |
| సద్గురువాణి సంవత్సర చందా (త్రై మాసికము) | 30-00 |
| శాశ్వత చందా | 300-00 |

మేనేజరు

శుకబ్రహ్మాశ్రమము

శ్రీకాళహస్తి - 517640.

